# హత్య కాని హత్య

# నిరుద్యోగి హత్య



రచయిత్రి:
చిల్లరిగె స్వరాజ్యలక్ష్మి
భాషా ప్రవీణ

★



ప్రచురణ.
Ch. స్వరాజ్యలక్ష్మి
ఇం. నెం. 11-10-132/1, ప్లాట్ నెం. 4, ఇందిరానగర్,
టెలిఫోన్ కాలనీ దగ్గర, కొత్తపేట,
హైదరాబాద్ - 500 035.

# అంకితము



**శ్రీ చిల్లరిగె వెంకట రామ లక్ష్మీనరసింహంగారు**

బ్రహ్మ ప్రేమను పిండీకృతం చేసి ప్రాణంపోసిన పవిత్ర వ్యక్తి.
అణువు అణువున, కణ కణంలో కరుణా ప్రపూర్ణ మహా
జలధి అయిన పతిదేవునకు నభక్తికంగా
సమర్పించిన పుస్తకరాజము.

# హత్య కాని హత్య

# నిరుద్యోగి హత్య

★ 

రచయిత్రి:

**చిల్లరిగె స్వరాజ్యలక్ష్మి**

భాషా ప్రవీణ



ప్రచురణ.

**Ch. స్వరాజ్యలక్ష్మి**

ఇం. నెం. 10-132/1, ప్లాట్ నెం. 4, ఇందిరానగర్,
టెలిఫోన్ కాలనీ దగ్గర, కొత్తపేట,
హైదరాబాద్ - 500 035.

ముద్రణ :

జ్యోతిక్రియేషన్స్ ఆఫ్‌సెట్ లెటర్ ప్రెస్

దేవినగర్, కవాడిగూడ,

సికింద్రాబాద్

ఫోన్ : 825137

హత్యకు కారకులు

* తల్లిదండ్రులా ?

* నిరుద్యోగమా ?

* దారిద్ర్యమా ?

* సంఘమా ?

* సన్నిహితులా ?

* దురదృష్టమా

నా ర చ న లు :

1. మహాశ్వేత — మహాగవేషణ
(కాదంబరీ పరిశోధనా రచన)

2. కవితా కలువల కంఠహారము (మొదటి భాగము)

3. కవితా కలువల కంఠహారము (ద్వితీయ భాగము)

రాబోవు ప్రచురణలు :

3, 4, 5 – భాగాలు
కవితా కలువల కంఠహారము

ఇది భగవద్విషయమైన చిన్ని పొత్తము. సహృదయులే దీనిని విలువకట్టి విజ్ఞత చూపగలరు. ఇందు కనీసపు వెల ప్రకటించినాము. భాగవత ఉపాఖ్యానములు ఇట్టిరీతిని వెలువరించాలని నా ఆకాంక్ష. సహృదయులు సహకరించ కోరుచున్నాను.

సి. హెచ్. స్వరాజ్యలక్ష్మి.



వెల : రూ. **10/-**

ప్రథమ ముద్రణ
1990 అక్టోబర్

ప్రతులకు :
**Ch. స్వరాజ్యలక్ష్మి**
ఇం. నెం. 10-132/1, ప్లాట్ నెం. 4, ఇందిరానగర్,
టెలిఫోన్ కాలనీ దగ్గర, కొత్తపేట,
హైదరాబాద్ - 500 038.

నవయుగ బుక్ హౌస్
సుల్తాన్ బజార్ : : హైదరాబాదు

మరియు

సవోదయా పబ్లిషర్స్
3-3-865, ఆర్యసమాజ్ ఎదురు వీధి,
**కాచిగూడ X రోడ్స్,**
హైదరాబాద్ - 500 027

పూజ్యులైన మా పితృపాదులు



శ్రీయుతులు గొబ్బూరి వేంకటానంద రాఘవరావుగారు

న్యాయవాది

జననం : 14-4-1892. నిర్యాణం : 26-10-1958

వీరి సెంటినరీ 1992లో జరుగనున్నది.

నాకు జన్మనిచ్చిన కన్న తండ్రి మహా విజ్ఞాని-జ్ఞాని-భగవద్గీత, రామకథాసుధ, ఆంధ్ర గద్య వాఙ్మయ చరిత్ర, జ్యోతిర్వేదము దీర్ఘతముని చరిత్ర, నక్షత్రములు, చుక్కల సుద్ది ఆంగ్లమున క్రిస్టపర్ ఆఫ్ ది హెవిన్స్ మొదలగు గ్రంథాలలో భూగోళ ఖగోళ సమన్వయం వ్యక్తం చేస్తూ మహా మహాద్భుత విషయాలను వ్యక్తం చేసి ప్రపంచ వైతాళికుల ప్రశంసలందుకున్న కీ॥ శే॥ శ్రీ గొబ్బూరి వేంకట రాఘవరావుగారు, వీరు శ్రీ కాశీ నాధుని నాగేశ్వరరావుగారి నేతృత్వంలో వెలువడిన "భారతి" మాస పత్రికలో శర పరంపరగా ఖగోళ విజ్ఞాన వ్యాసములు వ్రాసి జయపురం మహారాజు॰ శ్రీ విక్రమదేవ వర్మ మహారాజుచే జ్యోతిర్విద్యా విశారద బిరదమును పొందిరి గద్య వాఙ్మయ చరిత్రకు రత్నఖచిత స్వర్ణమయ పతకమును గ్రహించారు. వారి ఆశీర్వాద ఫలితమే నాయీ అక్షర సేవ.

Ch. స్వరాజ్యలక్ష్మి

# కరుణగాథ

గుండెల్ని పిండివేసే కరుణగాథ యీ నిరుద్యోగి హత్య అనే పెద్ద కథ లేదా చిన్న నవలిక. మనుషులలో దేవత లున్నప్పుడు రాక్షసు లుండటం కూడా సహజమేనేమో! అనివార్యమేమో ననిపిస్తుంది ఈ కథ చదివితే ఈ కథంతా చదివితే నిలువెల్లా నిట్టూర్పు వెలువడుతుంది. 'లోకం శోకహతంచ సమస్తం' అని శంకర భగవత్పాదులవారు చెప్పింది వాస్తవం అనిపిస్తుంది. నరసింహం, శాంతల దీనగాథ కళ్ళు జల జల లాడిస్తుంది. శ్రీమతి స్వరాజ్యలక్ష్మిగారు ఈ విషాద కథను ఐదు చిన్న ఖండికలుగా విభజించారు. అంటే 5 చిన్న భాగాలుగా పూర్తిచేశారు. ఆమె ఉద్దేశించారో లేదో కాని పాంచభౌతికమైన యీ మానవ జీవితంలో యీ కపటాలు, కార్పణ్యాలు, కల్మషాలు, కాపీనంలు, కౌటిల్యాలు ఎవరిని ఉద్ధరిస్తాయి? ఎవరుమాత్రం కలకాలం ఉట్టికట్టుకుని ఇక్కడే ఉండి పోతారా? అనే నిర్వేద సందేశం యీ కథలో వ్యక్తమవుతుంది.

మొదటి నుంచి చివరిదాకా విషాదాభిముఖంగా పరమ దుఃఖ పర్యవసానంగా సాగిన యీ కథ కరుణాకాతరమైన తోడిరాగంలా సాగుతుంది. అందుకేనేమో భాషాశైలి కూడా అక్కడక్కడ బరువుగా కనపడుతుంది. ఇటువంటి ఇతివృత్తానికి అటువంటి బరువు తప్పదు.

ఒకప్పుడు అగ్రవర్ణాలమని మిడిసిపడేవారి కుటుంబ జీవనంలో చాలా రాక్షసత్వం చోటుచేసుకొని ఉండేదేమో ననిపిస్తుంది ఈ కథ

చదివితే. విధి వంచితలు దుఃఖ భాగినులు అయినవారిపట్ల కనికరం లేకుండా ఉమ్మడి కుటుంబాల బండెడు చాకిరి కొత్తకోడళ్ళ నెత్తినపెట్టే వారేమో! అది గొప్ప కాబోలు. సాటివాళ్ళలో మెప్పు కాబోలు, ఆనాటి అబలల ఆర్తనాదాలు, ఆక్రందనలు, అభిశప్త హృదయవిదారక మైన అడియాసలు ఆ నాటి సాహిత్య జీవనంలో ప్రతిబింబితమైనాయి కదా. అజ్ఞానం, అవివేకం, అవిద్య, ఆత్మచ్యుతి, అహంకారం ఆ నాటి అనర్థాలన్నిటికీ కారణం, 'స్నుషా అధిక పాలనీయా' అనే ఆర్యధర్మాన్ని ఎందుకు మంటగలిపినట్లు ఆ నాటి పురుష పుంగవులు, కుటుంబ సంబం ధాలలో అనుబంధాలలో కోడలును అధికంగా ఆదరించాలి, గౌరవిం చాలి, మన్నన చేయాలి, బుజ్జగించాలి అని కదా భారతీయ సంస్కృతి చెబుతున్నది. కోడలు ఇంటికి రాణి అని వేదం చెబుతున్నదే! ఇదేనా ఆ నాటి కుటుంబాల సంస్కారం అనిపిస్తుంది ఈ కథ చదివితే.

రెండో ప్రపంచ యుద్ధానికి ముందు నిరుద్యోగం మహమ్మారిలా సంఘాన్ని పీడించింది. నిజమే కాని ఇంత విషాదమా? తల్లి దండ్రుల స్వార్థం ఇంత క్రూరమా? అనిపిస్తుంది. అది ఆనాటి అనాగరకత, పోనీండి, ఆర్థికంగా స్వావలంబన లేకపోతే ఆడపిల బతుకు అధోగతే.

శ్రీమతి చిల్లరిగె స్వరాజ్యలక్ష్మిగారు భావుకత గల మంచి రచయిత్రి. 222 పుటలలో 35 శీర్షికలలో శ్రీమతి స్వరాజ్యలక్ష్మిగారు బాణభట్ట మహాకవి విజ్ఞాన సర్వస్వమైన మహాశ్వేతపై గొప్ప పరిశోధనా గ్రంథం రచించారు. ఈ ఒక్క 'మహాశ్వేత మహా గవేషణ' అనే కాదం బరీ పరిశోధనారచన చాలు ఆమె ఈ నాటి రచయిత్రులలో విశిష్ట స్థానీయురాలు అని తెలుసుకోవడానికి. ఏ రచన అయినా మంచి రచ నగా రూపొందడానికి గొప్ప రచనగా భాసించడానికి రచనలో ఒక తాదాత్మ్యానుభూతి, ఆత్మీయతా ముద్ర అవసరం. మహా గవేషణలో

ఈ రెండూ పుష్కలంగా కనిపిస్తాయి. ఆమె సాహిత్య సంస్కారం, అక్షర సంపన్నత ఈ వ్యాఖ్యానంలో అ సాంతం దర్శనమిస్తాయి.

భాగవత పరమార్థ పరమ సుందర హృదయంగమ వచనగీతికల రూపంగా కవితా కల్హార కంఠమాలలు ఆమె కన్నయ్యకు సమర్పించారు. ఇంతవరకు ఈ కలువమాలలు రెండు కూర్చారు. విజ్ఞత, భగవద్భక్తి, ఉత్తమ సంస్కారం, ఆధ్యాత్మిక నిరతి, ఔదార్యం, అవ్యాకులత, సుమనస్కత, సాహిత్యానురాగం, ఆమెకు తండ్రిగారి నుంచి వారసత్వంగా సంక్రమించాయి. సంస్కృతం చదివి సంస్కృతి పట్ల ఆకర్షితులైన రచయిత్రులు ఏరీ ఇప్పుడు ? ఇందుకే ఈ తల్లికి నమస్కారం.

(కృష్ణ దశమి, ప్రమోద కార్తీక 11–11–1999)
అక్కిరాజు రమాపతి రావు.
హైదరాబాదు.

# అక్షర ఆలాపన

ఈనాడు వచన ప్రక్రియ జనాకర్షణను పెంచుకుంది. పాఠకాభిమానుల మన్ననలను అందుకుంటోంది, అందులోను వ్యాసంకంటె నవల, కథ అధిక ప్రచారంలో వున్నాయి. పాఠకలోకాన్ని పెంచాయి కూడా! సామాన్య పాఠకలోకానికి అందుబాటులో వున్నాయి కూడా! పండిత పామరభేదం లేకుండా అందరి హృదయాలను ఆకట్టుకుంటు న్నాయి. వీటికి కారణం మానవుల జీవిత కథలె అందులో ఆలంబనం చేసుకున్నాయి కనక. వ్యవహారికం అందులో చోటుచేసుకుంది కనక. జనుల కర్థమయేభాష ఆది-జనుల కథ అది.

రచయిత లేక రచయిత్రి అనుభవంలోంచి వచ్చిన కథకున్న ఆత్మీయత కృత్రిమ కథకు ఎక్కువ వుంటుంది? సామాజిక స్ఫూర్తిని ప్రతిబింబించలేని కథలు సమాజంలో నిలబడలేవు—పాఠక హృదయాన్ని కదలించలేవు అన్నది యదార్థం. రచయిత(త్రి) హృదయంలోంచి వెలువడిన కథ పాఠక హృదయంలోకి సూటిగా వెళ్ళి నిలబడుతుంది అనడం అతిశయోక్తి కాదు.

చిల్లరిగె స్వరాజ్యలక్ష్మిగారి హత్యకాని హత్య నిరుద్యోగి హత్య ఒక కథ అని చెప్పవచ్చు. నేటి సమాజంలో జరుగుతున్న ఒక అన్యాయాన్ని, ఒక అక్రమాన్ని అనుభూతితో చిత్రించి ఆవేదనలో పాఠక లోకంముందు వుంచారు.

ఈ కథలో నాయకుడు వివాహితుడైన ఒక నిరుద్యోగి. కథ విషాదాంతం, విషాదంలో నుంచి కథానాయకుని భార్యలో చైతన్యం స్ఫురించింది.

జలంలో నుంచి అగ్ని పుట్టినట్లుగా విషాదంలోంచి చైతన్యం ఉద్భవించడం కథను వెలుగుబాటవైపు నడిపించడమే. విషాదంలోంచి కూడా నిరాశ పుట్టకూడదనే విశ్వాసం పాఠకలోకాన్ని ఆలోచింప చేస్తుంది. కథకాని (కథానిక) నవల దాని ఆనందమే ప్రధానంగా కలిగి వుండినా ఔపదేశముతో కూడిన బంగారానికి తావచ్చినట్లేకదా!

'హత్య కాని హత్య' అని కాని 'నిరుద్యోగి హత్య' అని కాని ఈ కథకు పేరుపెట్టిన అసలు చాలు కాని అన్యాయం పేరు చెబితేనే ఆవేశం కలిగె స్వరాజ్యలక్ష్మిగారి చేతిలో కలం వుంటె అది సగంలో ఎలా ఆగుతుంది. వారి ఆవేదనలోంచి వెలువడినదే వారి 'హత్య కాని హత్య—నిరుద్యోగి హత్య'.

ఇందులో కథ హృదయ విదారకం. ఉద్యోగము లేదని ఇంటి పెద్ద కొడుక్కి వైద్యము చేయించక కన్న తల్లి తండ్రులే దయా దాక్షిణ్యములు లేక చంపివేసిన కథ. స్వరాజ్యలక్ష్మిగారి దృష్టిలో అది హత్యే. కూతుళ్ళ వెళ్ళిళ్ళకు-పండుగలకు విచ్చలవిడిగా ఖర్చుపెట్టే తల్లి తండ్రులే వివాహితుడైన కొడుకును సవతితల్లి ప్రేమను చూపిన కథ యిది. నిజంగా అలా జరుగుతుందా? అని ఎవరైన అనుకోవచ్చు—కాని కథ చదివితే తప్పకుండా ఈ సంఘటన జరిగే వుంటుంది అనిపిస్తోంది. అంత అనుభవంతో కళ్ళకు కట్టినట్లుగా చిత్రించారు స్వరాజ్యలక్ష్మిగారు. కొడుకు మరణించగానె కోడలిని చిత్రహింసకు గురిచేసిన మూఢాచారుల ప్రవర్తనను యథా తథంగా ఇందులో రచయిత్రి రాసింది. ప్రాణంతో సమానంగా ప్రేమించిన భర్తను పోగొట్టుకొని వారు పెట్టె చిత్రహింసలు భరించలేక ఆ మూఢాచారాలను ఆచరించలేక ఆ యినుప సంకెళలో

నుంచి ఆమె తప్పించుకుంటుంది. అంతం బాగుంది. ఆ బాధలో నున్న పరిక్షైన ఆదర్శ మీ కథ.

ఇందులో కథనం సెలయేరులా సాగింది. మధ్యలో కొండలు, గుట్టలు వున్నా దాటుకుపోయే సెలయేరులా బాధాతప్త హృదయంతో ఆవేశం అలుముకున్న సంఘటనలు, వర్ణనలు ఎన్నో వున్నాయి ఆవేశం మీద అధికారం వున్న స్వరాజ్యలక్ష్మిగారు ఆవేశానికి అనుగుణంగా వర్ణనలు, సంభాషణలు రాశారు. సామాజిక స్ఫూర్తి, సహజ పాండిత్యము కలిగిన స్వరాజ్యలక్ష్మిగారి ఈ పెద్ద కథ తప్పక పాఠకలోకం మన్ననలను అందుకుంటుందని ఆశిద్దాం, ఇంకా వారి కలం నుండి ఇటువంటి సాహిత్యం వెలువడాలని అవి పాఠకలోకాన్ని ఆకట్టుకోవాలని ఆశిద్దాం. మూఢాచారాలకు కనువిప్పు కలగాలని కోరుకుందాము.

జైహింద్

**వాసా ప్రభావతి**

"కవి కౌస్తుభ"
ఆచార్య తిరుమల
301 నందిని కాంప్లెక్సు,
మోజంజాహి మార్కెట్,
హైదరాబాదు - 500 195.

# అభినందన

మన దేశంలో అనేక సమస్యలున్నాయి. వాటి పరిష్కార మార్గాలు మాత్రం అంత తేలిగ్గా కనిపించవు. ఎంతమంది మేధావుల ఆలోచనలు ఆహుతి అవుతున్నా, ఒక్కొక్క నెత్తురుబొట్టులోంచి వేలాదిమంది రాక్షసులు పుట్టినట్లుగా. ఒక్కొక్క సమస్యలోంచి కోట్లాది సమస్యలు పుట్టి, ప్రజని, ప్రభుత్వాన్ని చూచి వికటాట్టహాసం చేస్తున్నాయే తప్ప — ఏ ఫలితం కనిపించటం లేదు. ఇంత దారుణమైన స్థితి — వ్యక్తిగత నిష్ఠ చెడటంవల్ల, రాజకీయ నాయకుల స్వార్థచింతన వల్ల — ఏర్పడుతూ వుందంటే — అది సత్యదూరమైన మాటకాదు.

పని చేయకుండా తిండి తినాలనే సోమరులున్నంత కాలం, ఒకరి శ్రమ మీద పదిమంది ఆధారపడి బతుకుతున్నంత కాలం, అధికార దాహంతో అలమటించిపోయే నాయకులున్నంతకాలం, ధర్మాన్ని ధనం జయించినంతకాలం, నీతిని అవినీతి ఏలినంతకాలం — సామాజికంగానే కాదు, వ్యక్తిగతంగా కూడా ఏ సమస్యకూ పరిష్కారం దొరకదు. దొరికినా, అది శాశ్వత పరిష్కారమై ఉండదు.

మన దేశంలో ఇంకా జ్ఞానాన్ని అజ్ఞానమే ఏలుతూ వుంది ఈ స్థితి తారుమారు కావటానికి దశాబ్దాలో, శతాబ్దాలో పట్టవచ్చు. వేచి చూడాలి!

మన దేశపు జటిల సమస్యల్లో అగ్రగణ్య సమస్య నిరుద్యోగం పారిశ్రామికంగా గణనీయమైన అభివృద్ధి లేకపోవటం. వ్యవసాయేతర ప్రవృత్తిగల జనాభా ద్విగుణీకృత మవుతూ వుండటం—సహజ వనరుల్ని సద్వినియోగం చేసే రాజకీయ యంత్రాంగం ఇంకా ఏర్పడక పోవటం ఈ నిరుద్యోగ సమస్యని సజీవంగా నిలుపుతున్నా యనటంలో తప్పు లేదు. ఈ పరిస్థితి—ఒక మహా చైతన్య విప్లవంవల్లగానీ మారదు. అంత మార్పు రావటానికి ఈ దేశంలో ఇంకా చాలాకాలం పడుతుంది.

భయంకరమైన ఈ నిరుద్యోగ సమస్య నేపథ్యంగా చిల్లరిగె స్వరాజ్యలక్ష్మిగారు చేసిన ఈ రచన—ఒక యధార్థ జీవిత గాథకు పట్టిన అక్షర దర్పణం.

ఇది కరుణ రసాత్మకమైన వచనకావ్యం! అజ్ఞానంతో, అహంకారంతో, ద్వేషభావంతో, మానవతని మట్టుబెట్టి, దానవతని వెన్నుదట్టి—రాక్షసానందంతో మిడిసిపడే—ఒకానొక సామాన్య బ్రాహ్మణ కుటుంబంలో సభ్యుడైన నరసింహమనే నిరుద్యోగి ఆర్తి గీతం — ఈ రచన. ఈ కథలో ప్రధానపాత్రలైన నరసింహం, శాంతల్ని – ప్రణయార్ద్ర జీవన ప్రశాంత సాత్త్విక మూర్తులుగా – స్వరాజ్యలక్ష్మిగారు చిత్రించిన తీరు అద్భుతంగా ఉంది. అలాగే, దేవాసుర ప్రవృత్తుల్ని ఒకే యింట ప్రదర్శించిన తీరుకూడా శ్లాఘనీయంగా ఉంది. స్వరాజ్యలక్ష్మిగారు విద్వాంద్రచయిత్రి. కాబట్టి, ఈ రచన అలంకారిక శైలితో, అహ్లాదకరకరమైన వర్ణనలతో, ఆణిముత్యాల్లాంటి సూక్తులతో—అపారమైన లోకజ్ఞతతో అలరారుతూ వుంది.

నిరుద్యోగి అయిన నరసింహం అనారోగ్య కారణంవల్ల చనిపోయాడు. కాదు, ఆతని దుష్ట కుటుంబ సభ్యుల నిరాదరణవల్ల పరోక్షంగా హత్య గావించబడ్డాడు, ఈ దౌష్ట ప్రభావం పడకుండా నరసింహం భార్య శాంత తప్పించుకుని నర్స్ అయి, మానవ సేవకు అంకితమయ్యింది. స్వరాజ్యలక్ష్మిగారు చూపిన పరిష్కారం—ముగింపు యింపుగా ఉంది.

కన్నవారే కిరాతులై తమ బిడ్డల్ని పొట్టన పెట్టుకునే దారుణ వ్యవస్థ యొక్క చిత్రీకరణవల్ల ఈ రచన గుండెల్ని పిండివేస్తుంది.

"ఏకో రసః కరుణ యేవ" అన్న భవభూతి భావానికి సజీవ చిత్రణమే ఈ రచన.

పరమ భాగవతోత్తమురాలైన స్వరాజ్యలక్ష్మిగారు ఇటువంటి సామాజిక రచనలు చేయగలరన్నా, చేశారన్నా—నా వంటివారికి ఆశ్చర్యంగానే ఉంటుంది. అయితే, ప్రతిభావంతులు చేయలేని దేముంటుంది".

స్వరాజ్యలక్ష్మిగారిని అభినందిస్తూ—

విధేయుడు

—ఆచార్య తిరుమల

వి. రామనరసింహం
7-67, రమణశ్రీ నిలయం
చైతన్యపురి ఫోన్ నెం. 87952

# నిరుద్యోగి హత్య

కొడుకు నిరుద్యోగి అయినా పెళ్ళి చెయ్యడానికి మాత్రం ముందడుగేస్తారు తల్లి దండ్రులు. ఆ తరువాత వాడు చిల్లిగవ్వ సంపాదించని చేతగాని చవటగా దెప్పిపొడుస్తూంటారు. పైగా ఇంటికొచ్చిన కోడలిని తమ యింటి నౌకరుకంటే హీనంగా చూస్తారు. శ్రీమతి స్వరాజ్యలక్ష్మి గారు ఒక నిరుద్యోగి అయిన కొడుకు, బండెడు చాకిరీచేస్తూ వీసమెత్తు అభిమానానికి నోచుకోని కోడలు, అత్త, మామలచుట్టూ జరిగిన ఒక మూర్ఖత్వపు మూసలో పడిన జీవిత కథను కళ్ళకు కట్టినట్లు "హత్య కాని హత్య—నిరుద్యోగి హత్య" అనే చిన్న నవలికలో బహు చక్కగా చిత్రీకరించారు పుస్తకం పూర్తిగా చదివిన తరువాత చెమర్చిన కళ్ళను తుడుచుకునేటట్లు వర్ణించిన అంశాలు ప్రతివారి హృదయంలో చెరగని ముద్ర లేసుకుంటాయి.

భార్యా భర్తల కెవరికైనా శరీర రుగ్మతలు కల్గినప్పుడు వైద్యులిచ్చే మందులకంటే ఒకరిపై నొకరు అభిమానంతో కూడుకున్న పలుకరింపులు, సపర్యలే వారి వారి శరీరారోగ్యాలను కుదుట పరచడానికి దోహదం చేస్తాయి అనీ, అట్లా కాని పక్షంలో వారు తిరుగులేని విషమ పరిస్థితులలో చిక్కుకుపోతారనే థీరీపై ఒక చక్కని కథను, కథ కాదు రచయిత్రిగా రన్నట్లు ఒక వాస్తవిక కథను మన కందించారు.

మనసులకు పూరట కల్గించే ఉల్లాస పూర్వకమైన సంభాషణలు, అయినవాళ్ళ ఆప్యాయత అనురాగాలవల్ల రోగులు బాధలను జయించి ఆరోగ్యాన్ని చేకూర్చుకుంటారనే నగ్నసత్యాన్ని ప్రస్ఫుటం చేశారు. అటువంటి ఆప్యాయతకు నోచుకోని నిరుద్యోగి నరసింహం మంచానపడి, చివరకి చనిపోవడం ఒకవిధమైన హత్యగానే కనపడి హృదయాలను ద్రవింప చేస్తోంది.

వాస్తవాలను అక్షరరూపంలో అందించే శ్రీమతి స్వరాజ్యలక్ష్మిగారింకా ముఖ్యంగా నేటి స్త్రీ సమస్యల్ని వెలికిదీసి సజీవ చిత్రాలను మన ముందుంచుతా రనడంలో సందేహం లేదు. వారి కట్టి శక్తి, ఆయురారోగ్యములను ప్రసాదింప వలసిందిగా భగవంతుని ప్రార్థిస్తున్నాను.

వి. రామనరసింహం
రంగస్థల సినీనటుడు,
రచయిత.

ముదునూరు హేమారామకృష్ణ
లలితానగర్.

# నిరుద్యోగి హత్య

ఈ రచయిత్రికి "ముందు మాట" రాయగలిగే శక్తి నాకులేదు. కాని ఈ నవలలో నిరుద్యోగి. సమస్యలు స్త్రీల కోదండ్రతికం, మూఢా చారాలు స్త్రీని స్త్రీలే అణగదొక్కే అమానుషత్వం ఆచారాలు ఇన్నింటిని క్రోడీకరించి రాసిన ఈ నవల స్త్రీజాతికి మాణిక్యమే అవుతుంది. ఇన్ని కష్టాలు, బాధలు పడ్డ శాంత చివరకి 'ఒక గుర్తింపు కలిగిన వ్యక్తిగా నిలబడి దేశసేవ చేయకలుగుతోందంటే ఆమెని ఎంత ఉన్నతురాలుగా నిలబెట్టగలిగారో రచయిత్రి ఊహించండి, ఏనాడో పోయిన "సరసింహం" ఈనాటికి కన్నీటిబొట్లు రాల్పించు కుంటున్నారంటే అయిన చిరస్మర ణీయుడు.

"మహాశ్వేత" పరిశోధనా రచన చేయగలిగిన ఈ మేధావి, కృష్ణుని "కవితా కలువలు" దండలు వేసిన ఈ భక్తురాలు సాంఘిక నవల వ్రాయగలరని నేనూహించలేదు. కవితా కలువల కవిత్వంలో ఆనందభాష్పాలు జాలువారే అనుభూతిని కల్పించిన ఈ భక్త శిఖామణి సాంఘిక నవలలో ప్రతి పఠితలచేత అచేతనంగా కంటివెంట అశ్రు ధారలు తెప్పించిన మహా రచయిత్రి స్వరాజ్యలక్ష్మిగారు. ఎన్ని కష్టాలకు ఓర్చి అయినా—స్త్రీ ఆత్మాభిమానంతో తను నిలబడటమే కాకుండా దేశా నికి ఉపయోగపడేటట్టు ఉండాలనేది ఈమె ఆకాంక్ష అనిపిస్తుంది. నిరుద్యోగి హత్య ముగింపు చదువుతుంటే.

# తొలి పలుకు

నేను అర్థించగానే ఎ. రమావతిరావుగారు, ఆచార్య తిరుమలగారు, వాసా ప్రభావతిగారు, హేమా రామ కృష్ణగారు, వి. రామనరసింహంగారు వ్రాసి యిచ్చిన అక్షర సందేశం నాకు ఎంతో ఎంతో సంతోషాన్నిచ్చింది.

ప్రతివారి ప్రతి అక్షరంలో వారికి నాయందున్న అపార ఆదర అభిమానాలనే అబ్ధి వెల్లివిరుస్తోంది.

అందరకూ నా మనఃపూర్వక కృతజ్ఞతా అభినందనలను అందిస్తున్నాను.

ఇట్లు
సిహెచ్. స్వరాజ్యలక్ష్మి.

ఈ గ్రంధ పతితలకు ఒక మనవి. సున్నితమైన మనస్కులు చదువ వలదని మనవి.

పతితలచే కనీసం రెండు కన్నీటిచుక్క లర్పింప చెయ్య గలిగితే నా రచన సార్థకం. ఆ నిరుద్యోగి ఆత్మకు ఆ అశ్రుతర్పణ చాలు।

# హత్య కాని హత్య

# నిరుద్యోగి హత్య

రచయిత్రి:

చిల్లరిగె స్వరాజ్యలక్ష్మి

భాషా ప్రవీణ

# హత్య కాని హత్య

## నిరుద్యోగి హత్య

### 1

గ్రీష్మంలో మండు టెండలకు మనుజులు అనుభవించే యాతనలు వర్ణించడం కష్టమే. తపనుని తీక్ష్ణతకు తహతహ లాడే మానవాళికి తొలకరి జల్లులలో కాస్త మనస్సు చల్లబడుతుంది. ఆ వర్షాలే వరదలూ, ఉప్పెనలూ ఉధృతం కాగా వేలాది గుడిసెలు, వందలాది మనుషులూ మట్టమవుతూ ఉండడం మనం వర్షాకాలంలో ఎన్నో చూస్తూనే ఉన్నాం. వర్షాకాలం తరువాత హృద్యంగా ఆశ్వీజం ఆరంభమవుతుంది. ఎండలూ వానలూ గాక చలి ముదరని కాలం అది దసరాలు ప్రారంభమవుతాయి.

హనుమంతరావుకు ముగ్గురు కుమారులు, ఇద్దరు కుమార్తెలు. పెద్ద కుమారునకు వివాహం చేశాడు. అతడు పట్టభద్రు డయాడు.

అరువది సంవత్సరాల క్రితం ఇప్పటికంటె ఘోరాతి ఘోరమైన నిరుద్యోగ సమస్య, స్వసంపాదన లేనిదే వివాహ ప్రసక్తి వద్దు మొర్రో యని ఎంత మొత్తుకున్నా నరసింహం మాట అసలు ఎవరూ వినకుండా వివాహం చేశారు. భార్యపేరు శాంత. నిరుద్యోగి భార్యగా ఆ యింట అందరిచేతా అతి చులకనగా చూడబడుతూ ఉండేది. ఇంట పుట్టిన మగ పిల్లవానికే ఆలనా పాలనా లేకుంటే ఇక ఆ ఇల్లాలు సంగతి చెప్పాలా? పట్టా ఉండి ఉద్యోగం లేక విలువ పీసమంనా్ని ని ఇవమను శ్రీల మధ్య

మనుగడ సాగించడం మానవత్వం ఉన్న ఏ ప్రాణికైనా కష్టాత్ కష్ట తరం గదా!

తనకే గోరంత గౌరవాదరాలు లేకుంటే తాళికట్టిన తన తరుణి దీనత్వం ఆతని హృదయానికి గాటమైన కత్తి వ్రేటుగా కలతను కలిగించేది. బ్రాహ్మణుడయిన కారణ చేత ఎంత తీవ్ర ప్రయత్నాలు చేసినా ఫలించడం లేదు, ఫలిస్తుందన్న ఆశ పూర్తిగా గగన కుసుమమైంది అయినవాళ్ళ ఆదరణా లేక ఆర్థికంగా అసలే తేరుకోలేక కుత కుత లాడే గుండెకు చల్లని శీతలచ్ఛాయ పూర్తిగా కనుమరుగైంది. మనోవ్యాధి ఏ వ్యాధిలోకైనా లాగేస్తుంది. సంతోషమే సగం బలం అన్నారు మనవారు.

ఒక చెల్లికి పెండ్లయింది. ముద్దు ముచ్చటలు తీర్చాలని వారు మొదటె ఒప్పించారు గనుక హనుమంతరావు వియ్యాలవారి నందరినీ దసరా పండుగలకు సాదరంగా ఆహ్వానించాడు. వియ్యాలవారు పది మందికి పైగా పండుగకు ముందే వచ్చేశారు. హనుమంతరావు భార్యకు గుండెజబ్బు, ఇంట్లో పనితాకిడి అంతా నిరుద్యోగి భాద్యదేగా. శాంత సూర్యోదయాత్పూర్వం నాలుగు గంటల నుంచి రాత్రి పదకొండు గంటల వరకూ నాగలికి కట్టిన దుక్కిటెద్దులా ఎంతపని చేసినా ఎవరికీ పట్టదు. ఏ కొంచమూ ఏ ఒక్కరి నుంచీ అభినందన అన్నది ఆశించే పని లేనేలేదు. అభిశంసనలు మాత్రం అపారం. కట్టుకున్న కాంత పడుతున్న కడగండ్లను కన్నారా చూస్తున్న నరసింహం మనసేగాక నరనరం విలవిల్లాడేది, పాపం ఏం చెయ్యగలడు? పండుగ ఇక ఒకరోజు ఉండనగా ఇతనికి విషజ్వరం వచ్చింది. రావడమే 105° పైగా. ఆ సమయంలో జ్వరం వచ్చిందని చెపితే అసలే ఖర్చు సమయం తల్లీ దండ్రులు విసుక్కుంటారేమో అన్న భయంతో ఎక్కడా ఎవరికీ చెప్పవద్దని శాంతకు గట్టిగా చెప్పాడు. పండుగలు అయి వియ్యాలవారికి

నుదురుమీద చెయ్యివేసి చూశాడు, వైద్యునివైపు కన్నీటిపొరలు తెరలు తెరలుగా పొంగి పొంగి పెల్లుబికి వస్తున్నాయి. ఒక్కసారి అతనివైపు ఎంతో బాధాయుతంగా ప్రశ్నార్థకంగా చూశాడు. అతని ముఖం ఆ చూపులూ కాస్త నిశితంగా పరీక్షిస్తే కోటి కోటి పుటలు గుండెల బరువు గ్రంథంలోంచి చదువవచ్చు. నిరుద్యోగపు బాధ ధనాభావపు తపన పారతంత్ర్య జీవిత దుఃఖ సముద్రమూ బంధు తిరస్కృత బడ బాగ్ని జ్వాలలూ బాల్యమాది ప్రేమించి తన అణువణువూ కణకణమూ ప్రతి ఊపిరి తాళికట్టిన తరుణికే అంకితం చేసి ఆమె ఆదరణ అను రాగమూ అనే అమృతపు జల్లులతోనే కొన ఊపిరిగా జీవయాత్ర సాగిస్తున్నాడన్న సంగతి వైద్యశిఖామణికి అర్థం అయింది. కరుణార్ద్ర హృదయుడైన కరుణాకరం తన కనురెప్పలతో మమత లందిస్తూ మంద హాసంతో నీ హృద్గత బాధని అర్థం చేసుకున్నాను అన్నట్లు నిండైన భావాన్ని అభివ్యక్తం చేశాడు. ముందు ఈ మందు పొట్లాం వేసుకో బాబూ మంచినీళ్ళు త్రాగు మానసిక కల్లోలాలు మెల్లిగా అరికట్ట ప్రయత్నం చెయ్యి. ఇప్పుడు నీకు మంచి మానసిక విశ్రాంతి అత్యవ సరం. మీ నాన్న సంగతి నాకు బాగా తెలుసు. ధన వ్యయం అంటె తగని బెంగ. నీ మందు మాకులకు విరివిగా విత్తం ఖర్చు చేస్తాడా? ఊహూ చెయ్యడు చెయ్యడు.

వాడు చిన్నప్పుడు వాళ్లమ్మ దాహంతో తహ తహ లాడుతూ ఉంటె చల్లని పానీయం ఇవ్వడానికి గంటసేపు తటపటాయించాడు. జేబులో చెయ్యి పెట్టనూ తియ్యనూ నిజంగా ఆ కొడుకు ఏదో యిస్తాడని పావం ఆ తల్లి ఎంతో ఎదురుచూసింది. ఊహూ ఇవ్వలేదే వాళ్ళనాన్న ఆ సమయానికి వచ్చి చూసి వెనువెంటనే చల్లని నిమ్మరసం (లిమ్కా) ఇచ్చి సేద దీర్చాడు. ఇదీ మీ నాన్న తత్వం. తత్వాలు మారతాయా పుర్రెకు పుట్టిన బుద్ధి—అన్నారుగా మనవాళ్ళు. నేను మీ నాన్నను?

మనః ప్రబోధంవల్ల అభివ్యక్త మౌతూంది, కనుక ఇవి చేతులు కావు తమ కాళ్ళు పట్టుకుంటున్నాను. దయచేసి ఉన్న విషయం చూచాయగా నైనా వివరించి చెప్పి పుణ్యం కట్టుకోండి. చూడండి డాక్టరుగారూ నా భార్య నా మేనమామ కూతురే, ఆమె మా వూళ్ళోనే పుట్టింది నాకు అయిదేళ్ళు మా అమ్మ మూడునెలల ఆ ముద్దుల పాపను చూపింది ఎం దుకో నాకు ఆ పాప కళ్ళ వెలుగే నా జీవితానికి చక్కని చలువపందిరి వేసినట్లనిపించేంది. నా శరీర యాత్రకు పులుస్టాప్ అంటే నాకేమీ భయం లేదుగాని బ్రహ్మ ప్రపంచంలో ప్రేమ అన్న పదార్థాన్ని అంతటినీ, ఒక చిన్న ముద్దగా చేసి అందంతటా సద్గుణ పుంజాలనె బంగారు రజను కలిపి పదారువన్నె బంగారు పడతిగా సృష్టించి ఇల్లాలిగా నా చేతి కం దించాడు, అయినవాళ్ళు అనుకునే అమ్మ నాన్న తదనుయాయులు ఆమె అడుగు పెట్టకముందు నాపై ఉన్న మమతానురాగాలని పూర్తిగా మంటగలపడానికి కారణం నన్ను పీడించి పిప్పిచేస్తున్న యీ నిరుద్యోగ పిశాచావేశ ఫలితమే అని గ్రహించాను. నాకూ నా భార్యకూ అన్నం నీళ్ళు ఇవ్వడమే మహా ఘనతగా భావించి పరవశించే భ్రష్టు పట్టిన మనుషులేమో అనిపిస్తూంది. జ్వర తీవ్రతలో కష్ట సుఖాలు మీ దగ్గిర వెళ్ళబోసుకుని కాస్త తేలికపడ్డాను నిజం దాచక నిష్కర్షగా చెప్పండి. నా మనో ధైర్యంతో ఈ విషజ్వర మహామారిలో పోరాడతాను, మీ శాయశక్తులా మందులివ్వండి. నా ఆరోగ్యం కుదిరి అర్థం చేచిక్కితే తమ ఋణం సంతృప్తికరంగా తీర్చుకుంటాను. అంటూ పాదాలు స్పృశించాడు, ఇదివరకే చూచాయగా నీ బాధలు అర్థం చేసుకున్నాను నాయనా నిర్ధనులను లోకం ఎంత నిర్దాక్షిణ్యంగా చూస్తుందో అనుభ వంవల్ల నేనూ కొంత గ్రహించాను బాబూ నా శాయశక్తులా మందు లిస్తాను. సంతోషం సగం బలం, మానసికానందం కంటె శారీరక రోగాల్ని ఉపశమింపచేసే మంచేముండి. బెంబేలు పడకు "దుఃఖేష్వను ద్విగ్నమనాః సుఖేషు విగతస్పృహః" అన్నాడు గద మన గీతా

చార్యుడు. పద నేను కూడా వచ్చి ఇంటిదగ్గర దిగపెడతాను. నాకంటె మంచి వైద్యం చేయించమని నీ పరిస్థితి మీ నాన్నకు సున్నితంగా వివరిస్తాను అని చన్నీళ్ళతో ముఖం తుడిచి వెన్నెల సన్నని జల్లులా! అన్నట్లు మధుర మందహాసంతో కుమిలి కమలిన అతని మనో కమలాన్ని కాస్తంత సేదదీర్చాడు, ఇంటికి వచ్చాక మధ్యహాలు ప్రక్కనున్న విశాలమైన గదిలో ప్రక్క యేర్పాటు చేయించి నుదుటిపై చల్లని పన్నీట ముంచిన గుడ్డను తడుపుతూ వేస్తూ ఉండమని చెప్పి మూడు గంటల కొకసారి మందుపొట్లాలు, మాత్రలూ ఇవ్వమని చెప్పి అతని దగ్గిరగా కూచుని మందులాంటి మంచి మాటలు మంచి మధురమైన మాటలు చెప్పమని చెప్పాడు, వీధి హాల్లోకి వచ్చిన హనుమంతరావుతో జ్వరం తగ్గడానికి కాల వ్యవధి చాలా పట్టవచ్చు, ఇతని మనసుకు ఊరట కల్గించే ఉల్లాస పూర్వకమైన సంభాషణ చేస్తూ ఉండడం మంచిది, వైద్యుల మందులకంటె అయినవాళ్ళ ఆప్యాయత అనురాగాలే రోగ బాధను జయించి ఆరోగ్యాన్ని అందివ్వగలదన్న విషయం మీకు చెప్పగలవాడనుగాను కాని విషయం విదమరిచి చెప్పడం వైద్యునిగా నా విధి. మిత్రుడవని ఇన్ని విధాల చెపుతున్నాను, అతని అభిలాష ననుసరించి ఆంగ్లవైద్య శిఖామణులకు చూపి తదనుగుణ్యమైన మందులు వాడడం మంచిది, రోగి నమ్మకాన్ని అనుసరించి మందు లిప్పించడం పెద్దవాళ్ళమైన మన బాధ్యతగా భావించి చెవుతున్నాను, నాడి బహు దుడుకుగా ఉంది. పడిదుడుకులు రాకుండా చూసుకోవాలి. అతనికి అయిష్టమైన పనులు చేయకండి, ఆవేదన కలిగించే సంభాషణలు సాగించవద్దని ముఖ్యంగా ఆడవాళ్ళకి చెప్పు. విషయం విషమించాక ఎవ్వరూ చెయ్యగలిగిందేమీ లేదని మిత్రుని ముఖం చూశాడు సాభిప్రాయంగా అతని ముఖంలో తలవెంట్రుక వాసిమాత్రం అయినా ఆందోళన కనిపించనేలేదు. ఏదో ముక్తసరిగా ముభావంగా ఎప్పుడో అప్పుడు ఎంతో కొంత ఇస్తూ ఉంటాను పుచ్చుకుని మాచిపోతూ ఉండు. పుత్ర

ఆ యింట ప్రతి మనిషీ ప్రతిక్షణం తీక్ష్ణాతి తీక్ష్ణమైన గాజు పెంకు గ్రుచ్చుకున్న కంటె అత్యంత బాధాయుతమైన పదజాలంతో ఎంతగా తూట్లు పడేలా చెయ్యగలమా ? అన్న ధ్యేయంతో ఆమె నెంతగా రాసి రాసి రాపాడినా అతని కనుకొలకులలో ప్రవహించే ప్రేమ సుధావాహిని మాటల మాధుర్యంతో సేదదీరి హృదయానికి ఊరట కల్పించుకుని కమనీయ మందహాసాల మందారాలలో మునిగి మగనిని మనసార సేవించుకొనేది, కత్తులబోను లాంటి ఆ అత్తింటిని కమనీయ పూలమాలల మందిరంగా మార్చుకు ఆనందాన్ని పొందుతూ క్షణ మొక మహా యుగంగా గడుపుతూ వళ్లంతా చెవులు చేసుకుని భర్త ఆరోగ్య విష యాలను వినాలనే తపనతో ఉండేది. ఆ యింట ఏ చిన్న వంకరపని జరిగినా అందరూ వాగ్బాణాల వర్షం కురిపించేవారే. పోనీ రోగికి దూరంగానైనా వినపడకుండా తిడతారా ? ఆహా ఆ ఆలోచనే లేదు. ఆ యింట ఏ ప్రాణికీ అయ్యో అన్యోన్యమైన చిన్న జంట భవిష్యత్ ఏమి కానున్నదో, ఈ చిన్న గవకు సహజమైన ప్రేమాభిమానాలు ఉండడం సహజం గదా ! అన్న చిన్న ఆలోచన అయినా లేని పరమ పరమ పాషాణ సదృశ సహృదయులు ఆ యింటనున్న పెద్దలంతా ఆ రోగి మంచం దగ్గిరే అహర్నిశలూ ముగ్గురికి తక్కువ గాకుండా తిష్ఠ వేసు కుని కూచుని వాగిన వాళ్ళ వాగినట్లే వాగుతారు ఇంటి కోడలు శాం తని అంట్లు సరిగా కడగలేదనో, బియ్యంలో రాళ్ళు ఏరలేదనో ఉప్పూ పప్పూ కూర నార పోపూ గీపూ వగైరాలు వంటకు సరిగా అందివ్వ లేదనో ఇల్లూ వాకిలీ అందంగా సరిదిద్ది సర్దలేదనో ఎంగిళ్లూ ఏమూలూ శుభ్రంగా ఉడికిన ఎండు మిరపకాయ ముక్కలూ మెతుకులూ తీసి అలకలేదనో దేవుడు సామగ్రి తళ తళ మెరిసేటట్లు తోమలేదనో మంచినీళ్ళ బిందెలు మక మకలాడు తున్నాయనో అంట్లు ఎంగిళ్ళూ

సరిగ్గా చేతులయినా కడుగకుండా ఆచారం కొంచెమైనా పాటించకుండా రామ రామ శూద్ర కొంపలా అన్నీ కలగా పులగం చేసిపారేస్తూందనో ఇంట నున్న జనానికి సదుపాయాలు సమగ్రంగా లేక సన్నగిల్లాయనో బంధు వర్గానికి సమపాళాలలో స్నానాలకు వేడినీళ్ళు వగైరాలు సంసిద్ధం చేయలేదనో ఇంటనున్న చిన్నపిల్లల సకాలంలో సపాళంగా పాలూ గీలూ ఉదయం భోజనాలకు పెరుగూ గిరుగూ వగైరాలన్నీ అందించలేదనో చాకలివానికి మాసిన బట్టలన్నీ వేయలేదనీ పద్దు జాగ్రత్తగా వ్రాయలేదనో పాలు సకాలంలో తోడు పెట్టడం లేదనో తెచ్చిన కూరగాయలు చక్కగా సర్ది పెట్టలేదనో ఇలా ఇలా ఎన్నో ఎన్నో ఏ చిన్న పని యైనా ఏ మాత్రం పొరపాటున చెయ్యకపోయినా అంతా సాధించి సాధించి వేధించుకు తినేవారే. ప్రాణాధికంగా ప్రేమించే భార్యను అతను వినకుండా ఎన్ని తిట్లు తిట్టుకున్నా ఫరవాలేదు, ఆ మాత్రం జ్ఞానం లేని పరమ మూర్ఖాగ్రేసరులు. అసలే జ్వర తీవ్రత సమయానికి తగిన మందూ మాకూ లేదు, ఆలనా పాలనా అసలే లేదు. ఎంత కాదన్నా తాళికట్టిక దగ్గిరనుంచీ పుట్టింటికి సంవత్సరానికి ఒక పూటయినా వెళ్ళని తనకోసమే ఆ యింట్లో ఇలా అందరిచేత, పని మనుషులకంటే హీనాతి హీనంగా అంపవు కోత లాంటి వేదన అనుభవిస్తూ నిరుద్యోగి నన్ను ఏమాత్రపు చిన్నచూపు చూడని మిన్నయిన మనసుగల ఆమె పరిస్థితి తలచుకుంటూ కంటితో చూడనివ్వరు చెయ్యారా చెంచాడు మందుగాని మంచినీళ్ళుగాని ప్రేమతో ఆమెచేత ఇవ్వనివ్వరు సరిగదా! ఎల్ల వేళలా ఆమెను శూలలాంటి మాట లనే తూటాలచే వేధించుకు తింటూ ఉంటే ఇక ఆ రోగికి స్వస్థత ఎలా చిక్కుతుంది?

రోజుకి రోజూ రోగంతో ధైర్యంగా ఎంత పోరాడినా తగ్గుముఖం పట్టే అవకాశం ఏదీ, పరిస్థితి నిముష నిముషానికి విషమిస్తూనే ఉంది.

# 2

నరసింహానికి పదేళ్ళ ప్రాయం అప్పుడే తన తరగతి పిల్లలతో చిఱు చెమటలతో చిఱు నవ్వుతో ఇంటికి వస్తున్నాడు

పగలంతా ప్రాణికోట్లు చేసే పనులు భాస్కరుడు చూస్తూనే ఉంటాడు గదా ? ఆయన కర్మసాక్షి మంచిపనులు చేసే మనుజులను అరుణ కిరణాల మందహాస వీచీ పరంపరలచే అభినందిస్తూ అస్తమయం కాబోతాడు కసాయి మన స్తత్వం గల మనుషలనీ హంతకులనీ అపనీతి పరులనీ కుటిల వర్తనులనీ కుత్సితపరులనీ ఇక చూడలేను బాబూ ఇక చూడలేనని మేఘాల వరదాల మాటుకి చేరి ముఖం దాచుకుంటూ సూదుల లాంటి కిరణాలచే వారి కళ్ళు మూసుకునేలా చేస్తాడు, సాయంత్రం చంద్రకాంత పూలు చంద్రుని రాకకు అమందానందంతో మంద హాసా లొలకపోస్తూ సున్నిత సులలిత పరిమళాలతో చిఱుగాలులకు ఒయ్యారాల నొలకపోస్తూ సంతసాన్ని సాదరంగా వ్యక్తం చేస్తూ ఉంటాయి.

ఆరేళ్ళ శాంత ఎంతో చక్కగా ఆడుకుంటూంది. అక్కడికి తల్లికి దూరమైన ఒక ముద్దులు మూటకట్టే ఒక తెల్లని చిన్న మేకపిల్ల కనిపించింది, దాని సోయగాన్ని పారవశ్యంతో చూసి చూసి పట్టుకోవా లనిపించింది ఆమెకు. అతి త్వరగా దగ్గిరకు వెళ్ళి చేతితో పట్టుకో బోయింది అది దొరకకుండా తప్పించుకుంది. శాంత నరసింహానికి మేన

మామ కూతురు, శాంత అమ్మమ్మగారి ఊరుకూడా అదే గనుక అప్పు డప్పుడు అక్కడకు వస్తూ ఉంటుంది అమలాపురానికి. ఆమెకు చిన్న మేక పిల్లను పట్టుకోవాలనే కుతుకం ఉన్నట్లు గ్రహించి అతడు ఒక్క తృటిలో పరుగుతీసి దానిని తెచ్చి శాంత చేతిలో పెట్టాడు, అప్పుడామె ఆనందం ఎంతో చూసి తీరవలసిందే వర్ణించడానికి కవుల కలాలకూ చిత్రించడానికి చిత్ర లేఖకులకూ కూడ అసాధ్యమే, ఆమె ఆనంద పారవశ్యాన్ని చూస్తూ నరసింహం ప్రపంచమే మరిచాడు. ఆతని మిత్రు లంతా ఈ దృశ్యం చూసి ఏమిరా ఇప్పుడే ప్రేమలో పడుతున్నావా? అని ముసి ముసి నవ్వులు నవ్వుతూ వెళ్ళిపోయారు. ఈ లోగా మేకపిల్ల తల్లికోసం మేమే అంటూ ఉంటె శాంత తనివితీరా దానిని ముద్దు పెట్టు కుని ఆప్యాయంగా అప్పుకుని చిన్నగా నరసింహంవైపు చూసింది. అతను వెంటనే దూరంగా ఉన్న తల్లి మేక దగ్గరకు దానిని చేర్చి శాం తను చెయ్యిపట్టుకుని ఇంటికి తీసుకువచ్చాడు, ఈ చిన్న జంటను చూచి అర్కుడు పక్కన నవ్వుకుని పశ్చిమకాంత పమిటచెంగు చాటుకు వెళ్ళి పోయాడు.

ఇంత బాల్యం నుంచే శాంతా నరసింహుల అనురాగలత దిన దిన ప్రవర్ధమానమైంది. శాంత పన్నెండు సంవత్సరాలకే శాంత తండ్రి అక్కగారి గొంతేనమ్మ కోరికలన్నీ తీర్చి వివాహం చేశాడు, పదునా రేండ్లు దాటాక కూతుర్ని అత్తవారింటికి పంపాడు. నరసింహం హృద యం కొలతల కందని అపార అనురాగ మహాజలధి.

తొలిరేయి తెలవారంగానే శాంత తన జీవితంలో ఎన్నడూ నర సింహం బాహుదండ ను డి విడివడకుండా ఉండాలని విధిని ఎంతగానో

ప్రార్థించింది. ఎన్నెన్ని ఊహలతోనో తన మనస్సును మేఘాల పంక్తితో ఉయ్యేల లూపింది.

భగవంతుని దయ వలన ఆమె నోములు ఫలించాయా అన్నట్లు గర్భ ఫలాన్ని అనుగ్రహించాడా భగవంతుడు, నరసింహం పట్టభద్రుడయ్యాడు, కాని నిరుద్యోగ రక్కసి కోఱల్లో చిక్కుకున్నాడు, అందునా బ్రాహ్మడయిన కారణంచేత ఎంత ప్రయత్నించినా ఏమీ ఉద్యోగం దొరకలేక, ఘనులనుండి ఉత్తరం గాని, దండిగా దక్షిణలుగాని ఇచ్చే సామర్థ్యమూ లేదు.

శాంతను ఎంతగానో లాలించాలనుకున్నాడు, ఏం చేస్తాడు? పురిటి సమయానికి అతని తల్లి ఖర్చుకూ శరీర కష్టానికీ తట్టుకోలేక కోడలిని పుట్టింటికి పంపింది.

కథ సవ్యంగా సాగలేదు. నొప్పులు వచ్చిన మూడు రోజుల తరువాత హాస్పటలులో చేర్చారు, అత్తింటివారు గాని పుట్టింటివారు గాని ఒక్కసారి అయినా వైద్యపరీక్ష చేయించనేలేదు, ఉభయులూ కూడ ఈ విషయంలో కాస్తయినా డబ్బు ఖర్చుపెట్టలేని ఘనా మనుష్యులు డాక్టర్లు ఈమెను చూచి పరిస్థితి విషమించిందనీ అతికష్టల మీద ఒక ప్రాణినిమాత్రమే బ్రతికించగలమనీ చెప్పారు. కట్టుకున్న భర్త గనుక తల్లిప్రాణం చూడవలసిందని నరసింహం వ్రాసియిచ్చాడు, డాక్టర్లు శాయశక్తులా ప్రయత్నించారు. కాని గర్భస్త శిశువు ప్రపంచంలోకి ప్రవేశించీ ప్రవేశించక ముందే శాశ్వతంగా కన్నుమూశాడు, శాంతకు మూడు రోజులకుగాని స్పృహ రాలేదు తండ్రిగా నరసింహం మాత్రం నిర్జీవమైనా జీవంతో ఉన్నాడా? అన్నట్లున్న ఆ పసి కందుని చూశాడు, గులాబిరంగు మేని ఛాయ, చంపలకు చారెడు కళ్ళు, నిగ

నిగలాడే మెత్తని గులాబి రేకులకంటె మృదులాతి మృదులమైన గ్గబులు ముద్దు లొలికే ఉంగరాలు తిరిగిన నల్లని చిక్కని చక్కని కురులు చిన్ని బొజ్జ నిష్ణాతుడైన కళాకారుడు మంచి కుంచెతో తీర్చిదిద్దిన నల్లని కమనీయమైన కనుబొమలూ మీగడ కంటె మెత్తనైన గులాబిరంగు అద్దినట్లున్న పెదిమలు ఆ అందమైన కనులమధ్య కుందనంలా మెఱిసే సంపెంగ మొగ్గ సౌరు ఈ ముక్కు ముందు ఏ మాత్రం పనికిరాదని బ్రహ్మకూడ పెదవి విరిచే చక్కని ముక్కు ఇలా ఇలా ప్రతి అవయవం అందం అంతా అక్కడే ఉందా ? అన్నంత చంద్రుని కంటె అంద చందాలు చిందే, అ బాలుని ఆత్రంగా చూశాడు, ఆనందంతో నరసింహం. కాని విత్తు కుంటె నిర్జీవమైన చల్లని తెల్లని ఒక గాజు బొమ్మ మాత్రం అని తెలిశాక గుండె బ్రద్దలైంది, దుఃఖ సముద్రం ఒక్కసారి పెల్లుబికింది ఇక ఎలాగా నిర్జీవమే గదా అని గట్టిగా గుండెల్లో దిగబడేటంతగా అప్పుకుని అప్పుకుని ఆవురు ఆవురు మన్నాడు, కళ్ళారా మళ్ళీ మళ్ళీ చూసి చూసి కుళ్ళి కుళ్ళి కుదిళ్ళి ఏడ్చాడు వద్దనే వాళ్లె లేరు దగ్గిరగా, ఆయాలు భూస్థాపితానికి రమ్మంటే చేతులో కొంచం డబ్బుంటే వాళ్ళ చేతులు తడిపి. బాలుని దేహాన్ని తనివితీరా తడివి తడివి అయినా కొంత తృప్తి చెందాలనుకున్నాడు, ఊహింప అర్ధ శూన్యుండ నేను అని తల బాదుకున్నాడు గోడకేసి పిల్లవానిని కౌగిలినుంచి జారిపడకుండా. పడ్డా జరిగే ప్రమాదం ఇంతకంటె ఏముంది ? వళ్లంతా నిమిరి నిమిరి భూస్థాపితం చేశాక ఆ రూపాన్ని మట్టితో కప్పలేక కప్పలేక ఆ రూపుని గుండెల్లోనే బహు భద్రంగా దాచుకుని విడువలేక విడువలేక కాళ్ళు తడబడుతూ గుండెలు తల్లడిల్లుతూ ఇల్లాలి స్థితిని తలంచుకున్నాడు, తను కన్నారా చూడనన్నా చూశాడు, శాంత కన్నువిప్పి అసలు చూసుకోనన్నా చూసుకోలేదే —— ఆహా భగవాన్ నాకు ఆ ప్రాణి నైనా దక్క

స్తావా? ఆమెకు తెలివి వచ్చి అడిగితె ఎలా చెప్పను? అని తహ తహ తహ లాడుతూ తరుణి మంచం దగ్గిరకు చేరుకున్నాడు.

శ్వాస మాత్రం ఉండి చేష్టలు లేని ఆమెను ఆప్యాయంగా చూసు కున్నాడు. ఆమె నుదురు చూస్తుంటే తన తనయుని నుదురే స్ఫురిం చింది. చేతినిండా ప్రేమామృతం తొణికిసలాడేలా ఎంతో లాలనగా ఆ నుదుటిని నిమురుతున్నాడు, భగవాన్ ఈ వెచ్చదనం ఇలానే ఉండనీ ప్రాణభిక్ష పెట్టు నా జీవనజ్యోతిని ఆరనివ్వకు అని అర్థిస్తూ ఉండే అతని నేత్రాలు సజల పూరితా లయ్యాయి, రెండు కన్నీటిబొట్లు ఆమె కపోలాలపై పడ్డాయి. అవి ఆమెకు అమృతబిందువు లయాయి. ఎప్పుడు తెలివి ఏస్తుందా అని నిట్టూర్పులతో నిముషం ఒక మహా యుగంగా భావిస్తూ కను రెప్పల కదలికకై నిరీక్షిస్తున్నాడు.

తల్లీ తండ్రీ తాత అత్తా పెదతండ్రీ పెత్తల్లీ ఇత్యాది బంధు వర్గం అంతా అతనిని బయటకు నెట్టాలని శతవిధాల ప్రయత్నిస్తున్నారు అతను వీరి చేష్టలకు ఏ మాత్రం చలించలేదు. వైద్యులంతా ఆత్రంగా చుట్టూ ఉన్నారు, శాంత తల్లీ దండ్రీ మేనమామ తదితర బంధువులూ ఆప్త మిత్రులూ ఆంతా శాంత ఎలా ఉంటుందా? అన్న ఆత్రంతో ఒళ్ళంతా కళ్ళు చేసుకుని చూస్తున్నారు.

శాంత అతి ప్రశాంతంగా కళ్ళు విప్పి కన్న నలుసును కన్నారా చూడాలన్న ఆతృతతో నలుప్రక్కలా తన ప్రక్కన చూసేస్తూంది కొండంత ఆశతో. అందరూ గొల్లుమన్నారు, కాని నరసింహం అతి ఓర్పుతో కళ్ళనిండా నీళ్ళు సుడులు తిరుగుతూన్నా కళ్ళు తెరిచిందన్న ఆనంద సమ్మిశ్రిత బాష్ప జలాలని నిగ్రహించు కుంటున్నాడు. అతని

కనులనిండా అవ్యాజానురాగ పూరిత అమృతాన్ని వర్షిస్తున్నట్లు కన్నీటి బిందువులు జల జల జారుతున్నాయి. నుదురుని ప్రేమతో నిమురుకుంటున్నాడు, ఆ స్పర్శలోనే ఆమెకు నిరాశా నిస్పృహలతో నిండిన అతని గుండె ప్రతిధ్వనించింది. కన్నెత్తి అతని ముఖం చూచింది, అంతా అర్థమైంది, అతని చేతిని ప్రేమగా తన చేతిలోకి తీసుకుని సాదరంగా నా సరూ ఎందుకింత బాధ! —— హు భగవంతు డిచ్చినట్లె ఇచ్చాడు, అతని సొత్తు అతడే తీసుకున్నాడు— అంతే నేనేమీ బాధ పడను సరూ నా సరూ నీ కన్నీటిని మాత్రం నేను చూడలేను, మరేమైనా భరిస్తాను. మీరు మామూలుగా ఉత్సాహంగా ఉంటె నా కంతే చాలు, విషాదచ్ఛాయలు పులుముకున్న మీ ముఖం నా కెంతో ఎంతో బాధాకరం అని అతని బుగ్గలు ఇంతకంటె బహు సున్నితంగా తవ తవ లాడుతూ మెత్తగా ఉండి ఉండేమనుకుంది. ఆ అనుభూతిని స్మరిస్తూ గట్టిగా కళ్ళు మూసుకుంది. నవమాసములు నిండుగా మోసి నొప్పుల బాధను మూడు రోజులు అనుభవించడమే గాని జీవం పోసి గర్భంలో గర్భంలో చిత్రించుకున్న చిన్న శిశువును కన్నారా చూడడానికైనా నోచుకోని శాంత దురదృష్టానికి ఎంతగానో దురపిల్లాడు భర్త. ఒక విధంగా చూడక పోవడమే మంచిదేమో చూస్తే తనలా మఱువలేక మరీ మరీ బాధపడి ఉండేది అనుకున్నాడు ఈ ఆలోచనా తరంగాలలో అతని మనసు సంక్షుభిత దుఃఖ సముద్రంలా అల్లాడిపోతోంది. శాంతని చూస్తూ ఉంటే తెలివి వచ్చినందుకు సంతోషంగానె ఉంది కాని ఆ సర్వేశ్వరుడు ఆరోగ్యమూ ఆయుర్భాగ్యమూ అయినా యిచ్చి ఎలా రక్షిస్తాడా అని గుండె చాలా అదుటుగానే ఉంది. ఆమెకు గర్భం అంతా సెప్టిక్ అయింది 103 డిగ్రీల జ్వరంతో బాధపడుతోంది.

మంచం దగ్గిర తల్లీ మేనత్తల సూదులలాంటి సూటీ పోటీ మాటలు ఇలా జరిగిందని ఆరోగిమీద ఆవగింజంతైనా సానుభూతి సాదరం లేదు

సరిగదా మందు త్రాగలేదనో డాక్టర్లతో అధిక ప్రసంగం చేసిందనో ఇలా ఏదో విధంగా సాధిస్తూనే ఉంటారు, పుట్టెడు దుఃఖంతో ఎంతో జ్వరంతో మూసిన కన్ను తెరవకుండా నానా బాధా పడుతూ ఉంటె వాళ్ళకి ఇలా ఆడిపోస్తూ ఉండడానికి నోళ్ళు ఎలా వచ్చాయో! ఇంత మానవత్వం లేని మనుషులు తనవాళ్ళని చూస్తూ ఉంటే నరసింహం నరనరం విలవిల్లాడి పోయింది, అందుకని అహర్నిశలూ శాంత మంచం విడువకుండా ఆమె మంచం దగ్గిరగా నున్న ఆసనాసికి అసలు విరామమే ఇచ్చేవాడు కాదు, అలా అనుక్షణం మితిమీరిన ప్రేమతో అవధులు లేని అనురాగంతో అసలు మందులకు శక్తి ఉన్నా లేకపోయినా తన ప్రేమ అనే దివ్యౌషధంతో ఆమెను అనుక్షణం లాలించి పాలించి పాలించి రక్షణ చేసుకుంటూ వస్తున్నాడు. తన వాళ్ళ నోళ్ళను సర్వదా ఆమె మంచం దగ్గిరే ఉండి కళ్ళతో కాస్త కట్టడి చేస్తూ ఉండేవాడు. రెండు పూటలా డాక్టరు వచ్చి రోగిని పరీక్షించి నపుడు ఆమె ముఖ కవళికలు జాగ్రత్తగా ఆకళింపు అలా డాక్టరు చూసి వెళ్ళాక వర డాలో డాక్టరుతో కొంతదూరం వెళ్ళి నమ్రతగా నమస్కరించి పరిస్థితి ప్రస్తావించి ఆమె నోటినుండి ప్రమాదం లేదన్నమాట విని ప్రమోదంలో శాంత దగ్గిరకు వచ్చేసేవాడు, ఇలా అన్ని విధాలా కంటికి రెప్పలా కమ్మని కమనీయమైన మనస్సుతో సంతోషంగా సాదరంగా సపర్యలు చేస్తూ ఉండేవాడు, తన తల్లీ దండ్రీ తెలుగు వైద్యుని పిలిపించినా ఆ మందులతో తృప్తిపడేవాడే కాదు, అతని వాళ్ళు అర్ధరాత్రి ఆ తెలుగు వైద్యుని పిలిపిస్తూ ఉండేవారు, మనిషిని సదుపాయంగా లేవనెత్తి మందులూ ద్రవ ఆహారాదులూ మంచి మాటలతో త్రాగి-పచేసే వాడు, మారాం చేసే పసిపిల్లలను మురువుగా బుజగించునట్లు ఆమెను అతి మక్కువతో సాకుతూ ఉండేవాడు, డాక్టర్లూ నరుసులూ చెప్పినట్లు ఏ

సమయానికి ఏ మందులో ఏ ఆహారం ఎలా ఇవ్వాలో అలా ఆవగింజం తైనా క్రమం తప్పకుండా ఇస్తూ ఆమెను సంరక్షించుకొనేవాడు.

ఉదయం ఆమెకు మెలకువ రాగానే ఆదరపూర్వక మందహాసాల మల్లెల జల్లులతో నింపి ఆమెకు ఆనందాన్ని అందించి మెల్లగా ఒత్తిగిల పడుకోబెట్టి దంతధావనాదులు చేయించి మెత్తని తుండుతో ముఖం తుడిచి కుంకుమ దిద్ది అద్దం అందించేవాడు. తదితర సపర్యలు నర్సులు వచ్చి చేస్తూ ఉంటే వారికి కావలసినవన్నీ సంసిద్ధం చేసేవాడు డాక్టర్లూ నర్సులూ చెప్పిన ప్రకారం తు. చ. తప్పక అన్నీ అతి శ్రద్ధతో నిర్వర్తించేవాడు.

ఇదంతా చూస్తూ ఉన్న అతని మేనత్తకూ తల్లి దండ్రులకూ మహా మహా అహంకారం ముంచుకొచ్చేది. కాని ఏం చేస్తారు? కొఱకం చుల లాంటి చూపులు విసురుతారు కడుపులో అరిటిపండు పిసుక్కుపోయేది, కక్కలేక చెక్కలేక అక్కసంతా ఉక్కపట్టి లోపల ఇదుముకోలేక పోయేవాడు.

వైద్యుల మందుల కంటె వెయ్యిరెట్లు అధికంగా పనిచేసింది అతని ఆదరపూర్వక సపర్యలె ఇలా సుమారు మూడు నెలలు అయాక ఆమెను ఎలాగో ఇంటికి తీసుకువచ్చారు. ఆమె సంపూర్తిగా కోలుకొనే వరకూ నిద్రాహారాలు మాని సేవలుచేసి తన మనిషిని చేసుకున్నాడు నరసింహం, నాయీ ఎన్ని వేల జన్మలైనా మీకే పాద దాసిగా ఉండేటట్లు ఆ భగవంతుడనుగ్రహించాలి. కృతజ్ఞతా పూర్వకమైన నా ఆనంద బాష్పాలనే పన్నీటితో సీ పవిత్ర పాదాలు కడిగి నా జీవితం పునీతం చేసుకుంటాను అంది శాంత అతి నమ్రతతో.

# 3

కాలం గడుస్తోంది. ఎలాగో వీళ్ళ మొరాలకించి నెలకు నలభై అయిదు రూపాయిల జీతంమీద ఉపాధ్యాయపదవి లభించింది. ఉద్యోగం వచ్చిన నెలలోపుగానే విషజ్వరం ఆవహించింది. వచ్చినదగ్గిరనుంచీ శాంతను ఒక్కసారి చూడాలనీ ఆమె ఆప్యాయంతో ఇచ్చిన మందూ మంచినీళ్లూ కాసిన్ని త్రాగాలనీ తనకోసం కన్నీళ్ళతో ఆక్రోశిస్తే కన్నీటిని గోటితో గోముగా తుడిచి మనుగడ అంతా మందహాసంతో సాగించమని నచ్చచెబుదామనీ కనుక్కున్న నలుసేగాక కట్టుకున్న భర్తాకూడా నీకు తీరని ద్రోహం చేయబోతున్నాడనీ ప్రేమామృతమైన నీ హృదయభాండము నుండి చిన్న బిందువు మనసారా ఆస్వాదించి ఆనందించి మందహాసపు మల్లెలు విరజిమ్మే సన్నిహిత ప్రాణి ఏదీ ఇకనీకు అందగా ఉండదనీ కలత చెందక నీ కన్నీరు వద్దనీ గోముగా తలనిమిరి ఓదార్చి మారు ప్రాణి నీడలేక ముందు మనుగడ ఎలా సాగించగలవనీ ఇలా ఇలా ఎన్నో ఎన్నో చెప్పి జీవితాంతం ఊరట లభించే ఒక ఉక్కు తునక లాంటి ఆలంబన అనే ధైర్యాన్నిచ్చాక ఇక తను శాశ్వతంగా దూరమైనా పరవాలేదని ఎన్నెన్నో ఊహించుకున్నాడు, భార్య తనను చూడలేదనే బాధను నిగ్రహించుకున్నాడు. ఆమె జబ్బులో తనవె తనవాళ్లు ఎంత కట్టడి చేసి ఎన్నెన్ని అనరానిమాట లని ఆమె దరికిచేరకుండా చీదరింపులు గలిగే పనికిమాలిన వెధవన్నర వెధవ పనులకు పురమాయిస్తూ పెట్టిన తిప్పలూ యాతనలూ తను మరిచిపోలేదు. ప్రతి కణంలో తలచుకున్నప్పుడల్లా నిప్పు కణాల్లా మనసుని తహ తహ లాడిస్తూనే ఉంటాయి. సపర్య చెయ్యనియ్యక పోతే మానె కనీసం ఒక్కక్షణం కన్నారా కంటితో అయినా చూడనివ్వరు, ఎందుకో ఇంటినిండా ఏళ్ళై

మందికి పైగా బలగం? వీళ్ళందరికీ అన్ని విధాలా సకాలంలో సమ సమ్మా అమురుస్తూ నవ్వు పులుముకున్న ముఖంతో అతి చలాకీగా ఎవరికో ఈ జ్వరం అన్నట్లు ఏ మాత్రం పట్టించుకోకుండా ఇంటిపనంతా దుక్కిటెద్దులా చెయ్యవలసిందే. ఎద్దు యజమాని, దానికి పచ్చగడ్డి కుడితీ పెడుతూ ప్రేమతో వెన్నుతట్టి మెడ నిమురుతూ దాని కష్టాన్ని గురించి సాదరంగా సానుభూతి చూపిస్తాడు. మూగజీవి అయినా విస్ఫారిత నయనాలతో ఎంతో కృతజ్ఞతను యజమానికి తెలుపుకుని ఆనందంగా ఆహారాన్ని స్వీకరిస్తుంది. అది అంతకంటె చులకనగాచూస్తూ అయిన వాళ్ళంతా అయినదానికీ కాని దానికీ కసురులూ విసురులూ అనే వడగండ్ల వానని ఎడతెరిపిలేక కురిపిస్తూనే ఉంటారు. నిరుద్యోగి నైనా నా వాళ్ళంతా ఎన్నెన్ని విధాల తూటాల లాంటి మాటలతో మనసుని ఎన్నెన్ని తూట్లుగా చేసి ఎంత బాధించినా కేవలం నా కైదండ నీడలో అవన్నీ మఱచి ప్రసన్న వదనుడై ప్రభాతంలో లేచేది, ఇక ఆ ప్రాణికి కాస్త ఊరట కలిగించి ఊరడించి హృదయంలో ఆ తల పోటును తొలగించాలనే దొడ్డ హృదయు లుండరు. నే నుండగానే యిన్నిపాట్లు పెట్టే మనుషులు ఇక అనాథ అయితె చెప్పాలా! అయ్యో శాంతా ఇక నీ జీవితం ఎలాగో? ఒక్కసారి—ఒక్కసారి నిన్ను కన్నారా చూడనివ్వరె, ఏమి! ఈ బంధువులు. వీళ్ళందరూ ఆ యా జంటలకు ఆఱుపదేండ్లు వచ్చినా మహా ఆరోగ్యంగా ఉన్నప్పుడే ఒకరి కొకరు ఒక్క క్షణం కనపడకపోతే కంగార్లూ గాభరాలూ టెలిగ్రాములూ కబుర్లు పంపడాలూను. ఇలా వారి వారి బాధలను వ్యక్తం చేసుకుంటారు. మా నాన్నకి జ్వరం వస్తే అమ్మ ఆ మంచం దగ్గిరనుంచి కదలనే కదలదు. స్నాన పానాలుకూడా మాని పథ్యం తినేవరకూ కౌదాము లెత్తుతుంది. అమ్మకు బాగులేకపోతే నాన్నకు అసలు నిద్రా

హోరాలే ఉండవు. ఆమె నిద్రపోతున్నా మెలకువగా ఉన్నా దగ్గిరే ఉండి ఆ యా సమయాలకు మందులూ మాకులూ ఆహార పానీయాలూ ఇస్తూ అతి ప్రేమగా ఆదుకుంటారె, వాళ్ళ దృష్టిలో నిర్ధనుడనైన కారణం చేత మేం మానవత్వం గల మనుష్యులమే కాము, అనుకుంటున్నారు. నా శాంత అనాథ అయితే ఆదుకునే ప్రాణే ఉండదు, ఎన్ని వేలమ ది వీరేశలింగాలు ఉద్భవించినా ఈ నరరూప రాక్షసుల మనస్తత్వాలు మారనే మారవు.

అనాధ ఎదురుగా వస్తే కత్తులు విసురుతున్నట్లు ఎంత కటుగ్గా చూస్తారో ఈ మనుష్యులు. అనాథల ద్రవ్యం అతి బాహాటంగా వాడు కోందుకు ఏ మాత్రం అభ్యంతరం లేదు. కాని వీళ్లు ఎవళ్లకీ ఏ సందర్భం లోనూ కనపడకూడదు, క్రొత్త వస్తువులు బట్టలు మొదలైనవి మొదట చేత్తో తాకకూడదు శుభ కార్యాలకు కేవలం చాకిరీలకు మాత్ర మేగాని. ఆప్యాయితతో కూడిన చల్లని చిన్న చూపుకు గాని మందహాస పూరిత మధురమైన మాటకుగాని ఆ మగువ నోచుకోలేదు, పసిపాపల దగ్గిర నుంచీ పళ్లూడిన ముదుసళ్ళవరకూ అంతా ఆమెను అవహేళనలు చేసే వాళ్లె, అనాధ అయేసరికి అందరి దృష్టిలో ఆమె ఒక జీవచ్ఛవం అనాథ అయేసరికి ఆమె చీమూ రక్తం అర్థం తేనెపట్టునుండి తేనె పిండి నట్లు పిండగలరే గాని, ఆమెకు మానవత్వపు విలువలను వీసమంతైనా ఇవ్వలేరు నరిగదా నిర్లక్ష్య అలక్ష్యాలతో అన్ని కోణాలనుంచి ఎంత వరకు కోసుకుతినగలరో అంతవరకూ అంతా కోసుకుతినేవాళ్లె ఎందుకో ఈ మనుషుల దృష్టిలో అంత చులకన. గజేంద్రుని రక్షించుటకు వెళు తున్న వైకుంఠవాసుని గూర్చి ఎందుకిలా పరుగులు పెడుతున్నాడు పరమాత్మ. "అనాధ స్త్రీజనా లాపముల్ వినెనో" అని అనుకుంటుంది మహాలక్ష్మి, ఒక్క భగవంతునికి మాత్రమే అనాధ స్త్రీ జనాలాపములు

వినిపిస్తాయి, ఆక్రందనలూ ఆవేదనలూ ఆ భగవంతునికే తెలుస్తాయి. ధనగర్వం విద్యాగర్వం సౌందర్యగర్వం ఉన్న మహా మహా కర్కశ హృదయులకు అనాథజన ఆవేదనలూ కన్నీళ్ళూ కష్టాలూ కనపడవు, వినపడవు. కాని యోచించే సహృదయత వివేకం శుద్ధశూన్యం అబ్బా నా శాంతని నా వాళ్ళూ, దానివాళ్ళూ సంఘం ఎంత నానా యాతనలు పెడతారో! ఉభయ వర్గాల బంధుకోటీ ఆమెకు ఒక్క పైసా అయినా యిచ్చే ప్రసక్తి లేనేలేదు. బ్రహ్మ ఈ మనుషుల గుండెల్లో బండరాళ్ళు పెట్టి సృష్టించాడో ఏమో? అయ్యో శాంతా. నీ చేత ఈ మూర్ఖులు కాసిన్ని మంచినీళ్ళ చుక్కలయినా ఇవ్వనివ్వరు ఒక్క మందుపొట్లా మైనా ఇవ్వనివ్వరు. అబ్బబ్బా వీళ్ళంతా ఏం మనుష్యులో భగవాన్, శాంతా నాకు నువ్వేమీ చేయలేదని బాధపడను. బ్రహ్మ చెముడు ముళ్లూ తుమ్మ ముళ్లూ సమయం వీళ్ళ కుళ్ళు నిండిన మాటలకంటె. ఏం చేస్తాం? మనసే సేకు మంచి ఓదార్పు నివ్వాలి.

నానాటికి స్థితి విషమిస్తూంది, ఆ జీవి తెలివు మయిపుల మధ్య కొట్లాడుతూ ఉంది, కాని తెలివి వచ్చినప్పుడు కన్నార్పకుండా తండ్రి ముఖంలోకి చూస్తూ అతని రెండు చేతులూ పట్టుకుని భోరున ఏడుస్తూ కన్నుమూసే ఘడియలు వస్తున్నాయి నాన్నా ఇవి చేతులు కావు కాళ్ళనుకో ప్రాణోత్క్రమణ సమయంలో ప్రాధేయపడుతున్నాను నన్ను కట్టుకునె ఈ గడప త్రొక్కిన శాంతకి సుఖమన్నది లేశమైనా లేకుండా పోయింది, కన్న నలుసుని కన్నారా చూసుకోనైనా లేదు, నా సేవ కసలు నోచుకోలేదు. నాన్నా ఎందుకూ బాధపడను కాని నువ్వు కాని వానిని చూస్తానని మాట ఇవ్వు నాన్నా మాటివ్వు అని ముఖం, బుగ్గలూ, చేతులూ తాకి తాకి భోరు భోరుమని ఏడ్చాడు, ఆ తండ్రి గుండె బండ

రాయీ కాదు, కాదు. ఒక ఎత్కయిన పక్కా ఇనుపగుండు, అది కఱుగు తుందా కఱగనే కఱగదు సరిగదా ఒక్కసారి సాదరంగా అయినా చూడకుండా అక్కడనుంచి మెల్లిగా పిల్లిలా ఉడాయించారు. అవతల గుమ్మంలోంచి భార్య ఏమీ మాట ఇవ్వవద్దని సంజ్ఞ చేసింది భార్య గీచినగీటు దాటె దమ్ములు లేవుగా ఆ దద్దమ్మ పెద్దమనిషికి.

కాస్త అతనికి తెలివి వచ్చినప్పుడల్లా మామగారినీ అచటి పెద్దలనూ అడిగి అడిగి కనీసం ఒక మంచి మాటా మార్దవంతో కూడిన ఒక చిన్న మందహాసం కోసం చూసింది ఆ ప్రాణి. అబ్బె అవి ఏవీ ఈ దేభ్యపు మనుషులనుంచీ ఆ రోగి నోచుకోలేదు, ఆ యింట అందరూ తీర్పరులే అందరూ వైద్యులే అందరూ సలహాదారులే అందరూ పెద్దమనుషులే అందరూ సంఘంలో ఘనత వహించిన ఘరానా మనుషులే అనారోగ్యవంతుడూ అర్ధ హీనుడూ ఆయువు హీనుడన్న తన పెద్ద కొడుక్కి కోడలును నిక్కచ్చిగా చూస్తాను నిశ్చింతగా ఉండు అని ఒక్కమాట చెప్ప లేని ఘనుడా తండ్రి

ఆఖరుకి నరసింహం ఇలా నిశ్చయించుకున్నారు. ఈ శరీరం ఎలాగూ అశాశ్వతమే, ఆత్మకు చావులేదు. నా ఆత్మ శక్తి చేత నా శాంతని నేనే చూసుకుంటాను, ఈ బెల్లం కొట్టిన రాళ్ళల్లా మొద్దుల్లా ఉన్న వీళ్ళందరి కంటె ఉత్తమోత్తమ స్థాయిలో ఉండేటట్లు చూసుకుంటాను, పొండర్రా పొండి మీరు ఎవ్వరూ నాకేమీ మాట ఇవ్వక్కర్లేదు. మీరంతా ఈ ప్రపంచంలో సుస్థిరంగా ఇలాగే ఉటికట్టుకు ఊరేగుదా మనుకుంటున్నారు, అయినవాళ్ళ అహంభావాలలో అహంకారాలతో దయాదాక్షిణ్య శూన్యులైన దానవాకృతి నున్న మానవాళితో కుళ్ళి కుళ్ళి కుతమారిన కుటిల హృదయాలతో డబ్బె శాశ్వతమనుకొని

దేహమే శాశ్వత గేహమనుకుని విఱ్ఱవీగె ఈ మానవాకృతితో నున్న మృగాల మధ్య ఇక ఉ డడం ఇష్టం లేకపోయింది.

ఒకమారు కొంచెం తెలివి వచ్చేసరికి తన తండ్రి అతని అన్న గారితో ఇలా అంటున్నాడు. అన్నా వీడు పోంగానే కోడల్ని ఈ యింట ఉండనిచ్చే ప్రసక్తేలేదు, కాదూ పోదూ అంటే అది కాళ్ళా వేళ్ళాపడితే యావజ్జీవం రెండు వందలు దాని మొహాన పారేసి జీవితాంతం వరకూ ఈ రెండు వందలలో బ్రతికితే బ్రతుకు, మమ్మల్ని ఇంతటితో వదులు ఇక నీకూ మాకూ ఎన్నడూ ఎలాంటి సంబంధమూ లేదని గట్టిగా చెప్తాను అన్నాడు, ఆ మాటలు నరసింహం వినసే విన్నాడు. తండ్రి ఔదార్యానికి తలముస్కలైన వేదనతో తల పంకించాడు. ఓ అప్రాచ్యపు నాన్న దద్దమ్మా అంటూ మందహాసంతో ఉన్న మధురాధిపతి మాధవ య్యను మనసారా ధ్యానంచేస్తూ ఆ మూర్తినే చూస్తున్నాడు, అంతకా లేచ మామేద స్మరన్ ముక్త్వా కళేబరమ్. అట్టివారు మా మేవ ఏష్యసీ అన్న వాక్యాన్ని సంస్మరించుకున్నాడు. మృత్యు సర్వ హరచ్చాహం అన్నాడు గనుక పరమాత్మ, అతనిని ఆనందంతో దరిచేరాలని ఆకాం క్షించాడు.

# 4

నేను చూసి సేవ చేసుకున్న పతిమూర్తి, మంచి ఆరోగ్యవంతమైన శరీరమూ, స్మిత వక్త్రుడు, మితభాషి మహా మనీషి. మహనీయ హృదయుడు, మన్మధ స్వరూపుడు, మధురాధిపతే రఖిలం మధురం అన్నట్లు నా నరసింహం నరనరం మధురాతి మధురమే మంచి దృఢ కాయుడు, సుందర వదనుడూ అందమైన కండలు తిరిగిన బాహు దండలు, సువిశాల భావాలకు ఇది నిలయమైందా? అన్నట్లున్న విశాల వక్షస్సు, మంచిగంధపు సువాసనలీను మేను, నిగనిగ లాడుతూ వంపులు వంపులుగా తిరిగిన అందమైన కురులూ తన సౌందర్యాన్ని చూచి మన్మథుడే చిన్నపోయి తలవంచి ఓటమిని అంగీకరిస్తున్నాడా అన్నట్లుంది ఆ సౌందర్యం.

నిదుర లేవంగానే అతని పాదాలపై తలనాన్చి సభక్తికంగా నమస్కరిస్తే లాలనగా లేవనెత్తి గౌరవ పురస్సరంగా సాదర నయనాలతో గడపవరకూ సాగనంపి కుడిచేతిని సున్నితంగా ముద్దిడుకొని రాత్రి నువ్విట చేరేవరకూ ఈ టానిక్కు గట్టి పని చేస్తుందిలే అని కళ్ళతోనే నొక్కి చెప్పేవాడు.

ఆమెకు ఇంట ఎంతపని ఉన్నా అతను లేచేసరికి ముఖ ప్రక్షాళనకు నీళ్ళందించేది, తుండు తెచ్చి ఇస్తే ఆమె చీర చెఱగుతోనే ముఖం తుడుచుకొనేవాడు కొంటెగా చూస్తూ, స్నానానికి సమపాళంలో నీళ్ళు

తొలిపి సబ్బూ వగైరాలు అన్నీ సిద్ధం చేసేది, పట్టుపంచ ఖండువా యిచ్చి సంధ్యా వందనానికి కావలసినవన్నీ అమర్చేది. ఆ తరువాత కట్టుకునే బట్టలు సిద్ధంచేసి పేపరు అక్కడ ఉంచేది, భోజనానికి సర్వం సన్నద్ధంచేసి పూర్తి అయాక చేయి కడుక్కోందుకు నీళ్ళు తువ్వాలు అందించేది, లేత తమలపాకులు తగినరీతిని సున్నంరాసి వక్కపొడితో తాంబూలం అమర్చేది విశ్రాంతిగా పడుకునే సమయానికి తలదిండ్లు సర్దేది. సమయానికి చల్లని మంచినీళ్ళు ఇచ్చేది. ఇవన్నీ సాధ్యమైనంత వరకు ఇతరులు గమనించని రీతిలో సాగిస్తూ ఉండేది, నరసింహం జ్వరంతో మంచాన పడ్డదగ్గిరనుంచీ మళ్ళీ ఈ సపర్యలు సంతోషంగా ఎపుడు ఎపుడు చేసుకుంటానా అని ఎంతగానో ఆరాటపడుతూంది. ఇంట్లో అంతా ప్రతిక్షణం అతని పరిస్థితులు చెప్పుకుంటూ ఉంటె వళ్ళంతా చెవులు చేసుకుని అతి శ్రద్ధగా వినేది. కళ్లు లోతుకుపోయా యనీ ఒళ్ళంతా గుడ్డపీలికలా తెల్లబడిందనీ గెడ్డమూ మీసమూ కురులూ అతిగా పెరిగిపోయాయనీ ఒళ్లు కేవలం అస్థిపంజరంలా ఉందనీ కళ్ళు రోజుకు రోజూ కాంతిహీన మౌతున్నాయనీ మందు త్రాగే స్థితి తప్పుతోం దనీ వెక్కిళ్ళు అతిగా వస్తున్నాయనీ ఇలా ఇలా ఎన్నో ఎన్నో అనుక్షణం ఆ నోటా ఆ నోటా వింటూనే ఉంది కాని ఏం చెయ్యగలదు. మూగగా ఆ వేదన అనుభవించడం తప్పించి తనను బాలెంతగా ఉన్నప్పుడు కంటికి రెప్పలా ఎలా ఎలా ఎంత ప్రేమతో లాలించి బుజ్జగించి బ్రతి కించుకున్నాడో ఆ యా ఘట్టాలన్నీ అనుక్షణం స్మరిస్తూనే ఉంది.

మొదటిరాత్రి పెద్దలంతావచ్చి గంధం పూయించి పాదాలకు దండం పెట్టమన్నారు. ఆ పాదాలు తామర పూవులులా ఎఱ్ఱగా ఉన్నాయి. పారాణి మరీ అందం ఇచ్చింది.

ఇప్పుడు పీళ్ళు చెప్పేవన్నీ వింటూంటె కణం కణం ఆ వేదనతో కరిగిపోతోంది.

# 5

వాకిటి నిద్రా చంద్రకాంతలు చక్కగా విచ్చుకున్నాయి. అమావాస్య చీకటులు అంతటా దట్టంగా వ్యాపించాయి, ఆయింట ఇక కటిక చీకటి తెరలే శాశ్వతంగా ఉంటాయని ఆ చీకట్లు గట్టిగా చెప్తున్నట్లనిపిస్తుంది. తొమ్మిది గంటలు కావస్తూంది, అంతా పట్టు పంచలు కట్టుకున్నారు క్రమ పద్ధతిలో శాంత అందరికీ విస్తళ్ళు వేసి ఉప్పు వడ్డించి నెయ్యి కలిగపెట్టి ఉంచి మంచినీళ్ళు పెట్టి పచ్చడీ కూర వడ్డన సాగిస్తూండే, నరసింహం గదిలోంచి మూలుగు కొంత గడబిడ కొనసాగింది. ఆ గది ముందుకు వచ్చింది మామగారు తలుపు మూసి చాప పరుస్తున్నాడు నలుగురూ సాయంపట్టి ఆ రోగిని క్రింద పరుండబెట్టారు, తల దగ్గిర అలసి తల్లి దీపం వెలిగించింది. అప్పుడందరూ తీరికగా గొల్లుమన్నారు, అర్థమైంది శాంతకు తలుపులు త్వర త్వరగా తెరిచి నూతి దగ్గిరకు ఎవరూ చూడకుండా నడక సాగించింది, పాపం అక్కడి పెద్దమనుషులలో ఉన్న పెద్దమామగారు వచ్చి అడ్డుకుని తలుపులు వేశి అలా వెళ్ళవద్దని గట్టిగా ఆమెను మందలించాడు, చుట్టూ చేరిన జనం ఏడుపులు బాగా తారస్థాయి నందుకున్నాయి. నిజమైన దుఃఖమో లేక లోకంకోసం ఏడుస్తున్నారో ఆ భగవంతుడికే తెలుసు. శాంత తన పడకగదిలోకి వెళ్ళింది, ఆమె పరిది చూస్తున్నారు, సీతమ్మలా జుట్టు ఉరిపెట్టుకుంటె నపోతుందనుకొంది, అతను వచ్చి చేతులు పట్టి ఆ పనినుండి ఆమెను తప్పించారు, ఇక అప్పుడు అక్కడ ఉన్న పెద్దలందరూ బలవంతంగా తీసుకువెళ్ళి చాపమీద నిశ్చింతగా పరుండి ఉన్న ఆ కళేబరం దగ్గిర కూచోపెట్టారు. అంత శాంత తల

నుంచి పాదాల వరకూ సాపేక్షగా నిమిరింది, ఆ శరీరాన్ని అలాగే చూస్తోంది. ఇది నాకు సంబంధించిన నా నరసింహంది కాదనుకుంది, దూరంగా వెళ్ళిపోబోతోంది.

అలా వెళ్ళే ఆమెను పెద్దలంతా బలవంతంగా ఈడ్చుకువచ్చి చాపమీద నిశ్చింతగా పడుకొని ఉన్న ఆ కళేబరం దగ్గిర కూలేశారు. ఒక్కసారి శాంత సిదానంగా ఆ దృశ్యాన్ని కన్నార్పకుండా చూసింది. మనస్సుకి ఏమీ అనిపించలేదు, ఎవరినో పడుకోపెట్టారు, పాపం పోయి నట్టున్నాడు అనుకుని పిచ్చి చూపులు చూస్తోంది, అక్కడ ఉన్న అత్తకు ఈ చర్య ఉల్లి మిరియం పులిమినట్లు మండుకుపోయింది, ఆమె విసురుగా భుజాలు గట్టిగా పట్టుకుని అలా బిత్తర చూపులు చూస్తావేం, ఆ శవం నీ భర్తే అంటె. నీ కోసం వాడు కడవరకూ కలవరించి కలవ రించి కన్నుమూశాడే, కనెసం గట్టిగా ఒక్క ఏడుపైనా ఏడవవేమె కఠినాత్మురాలా, పాపిష్టి ఘటమా నీ బ్రతుకు బండలై పోయిందే, ఇక నీ ముఖం ఎవరూ అభిమానంగా ఆప్యాయంగా మంగళకరమైన ముఖం అనుకోరే, తెల్లవారి నీ ముఖం చూస్తే నానా శాపనార్థాలూ పెడతారే, నీ పసుపూ, కుంకుమా, పువ్వులూ అన్నీ వాడితోటే బూడిద అయి పోతాయే ఆపశకునపు పక్షివని. నువ్వు బతికున్నంత కాలం ఆ బాల గోపాలం అక్షులూ, పక్షులు తిట్టి తిట్టి పోస్తారే, ఒకమూల పడి బతికి నంతకాలం కుళ్ళి కుళ్ళి ఏడ్చి చావాలే నువ్వైనా చచ్చావు కావు మా వాడికి మహారాజులా మరో పెళ్ళయినా చేసేదాన్ని, ఇంత దారుణం జరిగినా కన్నీటిచుక్క రాల్చవేమే పాతకీ కణ కణంలో ప్రేమని రంగ రించుకు పుట్టిన నా ప్రేమైక మూర్తిని చూసుకుంటే నా కడుపు తరుక్కు పోతోందే, నువ్వింత పాషాణానివి అయూవేమే అని కొడుకు శవం మీదకు బలవంతంగా త్రోసి ఆమెను ఏడిపించాలని విశ్వప్రయత్నం చేసింది అత్త

అందరివైపూ భర్తవైపూ చూస్తూ, దాని కెందుకు ఏడుపు వస్తుం దండీ, మొదటినుంచీ దానిది పరమ పాషాణపు గుండె, కన్న కడుపు గనుక నాకు గుండె తరుక్కుపోతోంది, దుఃఖం ఆపుకోలేక పోతున్నాను, దాని కెందుకు వస్తుందీ ఏడుపు! అనామకుడూ అర్థహీనుడూ ఎప్పుడు అంతమవుతాడా అని చూస్తోంది; ఈ పాపిష్టిదాని దృష్టి పడి ఎక్కడ బ్రతకడో అని కనీసం దాన్ని అసలు చూడనివ్వనేలేదు. అయినా దీని దురదృష్టం చేతనే భగవంతుడు నా బిడ్డని తీసుకుపోయాడు, అంటూ శాంత భుజం గట్టిగా పట్టుకుని పాపిష్టిదానా నీ మనసులో ఉన్నా లేక పోయినా నటనకోసం అయినా గట్టిగా ఒక్క ఏడుపైనా ఏడవ్వే అని ప్రోత్సహించింది, పాపం ఆ మాట అనకూడదు గాని ఆమె చేస్తున్న దదేనేమో!

శాంతకి కనువిప్పు అయింది, జరిగిన సంగతి అర్థమైంది, ఒక్క సారి తెల్లని బట్ట కప్పి అక్కడ పడుకోపెట్టిన శరీరాన్ని కన్నార్పకుండా నిశితంగా చూసింది, ఎండిన ఎండుపుల్లల్లా శల్యాలతో ఉన్న శరీరం డొక్కలు ఎక్కడకో పోయి శుష్కించి యున్నాయి

కెవ్వున ఒక కేక వేసింది. మామగారి దగ్గరకు పరుగెత్తింది. ఆతని ముఖం వంక తీక్షణంగా చూస్తూ, ఈయన నా భర్త కాదు, నా భర్త నేం చేశారు చెప్పండి, నా భర్త నేం చేశారో చెప్పండి మామ గారూ, ఇలా పదిమంది మధ్య మొసలి కన్నీళ్లు కారుస్తూ ఉన్న మామ గారి రెండు భుజాలూ పట్టి గట్టిగా ఊపి ఊపి అడిగింది, మామగారు పిల్లిలా బిత్తరపోయి చూశాడు, ఎప్పుడూ ఎదుటికి రానిది వల్లెత్తి పలుకని కోడలు కంచుగంటలా గొంతెత్తి సింహగర్జనలా పెద్ద ఉరుము ఉరిమినట్లు అడిగేసరికి ఈ పరిణామానికి బిక్కు బిక్కుమని నిరుత్తరుడయ్యాడు.

చుట్టు పక్కల వాళ్ళు ఆమెను పట్టుకుని నీ భర్తేనమ్మా ఇతడు. నీ భర్తే, కాసేపు దగ్గర కూచుని కాస్త నీ మనస్సులో బాధ వెళ్ళగక్కుకో ఇలా ఈ కళేబరం దగ్గర కూచుని ఏడ్చే అవకాశం మరి రాదు, కాస్త అతని మనసుకు శాంతైనా ఉంటుంది అంటూ ఆమెను బలవంతంగా తీసుకువెళ్ళి అతని శరీరం దగ్గర కూచోబెట్టారు, మళ్ళీ మళ్ళీ పరీక్షగా చూసింది శాంత, శాంత విజృంభించింది వీర నృసింహ మూర్తిలా విజృంభించింది, శాంతరూపం విడిచి, విశ్వరూపిణిగా కాళీ కరాళ మహంకాళిగా అయింది, నిజంగా చెప్పండి, నా భర్తని చంపిందెవరు? ఇది మామూలు చావుకాదు-కళ్ళింతింత పెద్దవి చేసుకుని గుండె మంటలో మండలు కొలుక్కుంటూ రెండు చేతులా జుట్టు పీక్కుంటూ ధరణి దద్దరిల్లేలా గట్టిగా అంచింది, విసురుగా రుసరుసతో అత్తగారి దగ్గరకు వచ్చి మేం హాయిగా ఉంటే చూడలేక నా భర్తని మీరంతా కుమ్మక్కయి చంపేశారు, నా భర్త తగిన మందులేక చచ్చిపోయారు, కాదు కాదు కసాయివాళ్ళల్లా మీరంతా కూడి కావాలనే చంపేశారు. ఉన్న ఆస్తి అంతా కట్టుకుపోతారా? కన్న కొడుకుకే మందులిప్పించక చంపుకున్న కఠినాత్మురాలివి, డబ్బుకోసం కన్నకొడుకునే చంపుకున్న దుర్మార్గురాలివి, కూచున్న వారందరి మధ్యలో భర్త శవంచుట్టూ శివం ఎత్తిన దానిలా గిరగిర తిరుగుతూ నిజం చెప్పండి. మీరంతా కలిసి నా భర్తని చంపేశారు పెద్దమనుషులంతా పెదవి విప్పరేం, ఈ శవం నా భర్తదని నాకు ఏమాత్రం అనిపించడం లేదు, బంగారు పచ్చని దబ్బపండు లాంటి శరీరం కండలు తిరిగి బలంతో ఉండే బాహువులు కుండలినీ యోగం చేసి ఆధ్యాత్మిక తపోశక్తిచె మిలమిల శివాజీ వివేకానందుల కళ్ళలా కాంతి పుంజాలు వెదజల్లె ఆ విశాల నేత్రాలు స్మిత వక్త్రుడు ఎన్నడూ చిఱునవ్వుముద్ర చెరగని మోహనమూర్తి. ఆ రూపమే నాకు కావాలసింది. ఏమీ పోలికేలేని ఈ నిర్జీవ శరీరం కాదు శవం నా భర్తది ఏమాత్రం కాదు. చెప్పండి మామ్మలు, అమ్మమ్మలు,

తాతలు, మజుదులు, పెద్దమామగార్లు, మీలో ఏ ఒక్కరైనా ఈ విష యం చెప్పండి అంటూ అందరి చేతులూ కాళ్లూ పట్టుకుని పలవించి పల వించి ప్రాణం విసిగింది, తనే మళ్ళీ స బాళించుకుని జుట్టు పీక్కుంటూ ప్రతివారి దగ్గరకూ వెళ్ళి మళ్ళీ మళ్లీ ఆడిగింది శాంత.

అలనాడు హస్తిన సభలో ద్రోపది భీష్మాది కురువృద్ధుల నంక రినీ నిలదీసి అడిగినట్లు నన్నోడి లన్నోడెనా తన్నోడి నన్నోడెనా అని అడిగింది. బావురుమని అరిచింది చీరచించుకుని జుట్టు పీక్కుని బొట్టు నేలరాసి గోడుగోడున రాళ్ళు కరిగేలా ఏడ్చి ఏడ్చి ఎంతమంది నడిగినా అంతా బెల్లం మొత్తిన రాళ్ళల్లా చావక్రింద నీరులా కిమ్మనలేదు, శవం కాళ్ళదగ్గిర పెద్దల దగ్గిర నెత్తీ నోరూ బాదుకుని ఎంత ఏడ్చినా ఆరోదన అరణ్య రోదనమే అయింది. సమాధానం లేదు, ప్రతి వాళ్ళ రెండు చేతులూ పట్టుకుని ఈయన నా భర్త కాడు కదూ దయచేసి మీలో ఎవ రైనా చెప్పండి అని అతి దీనాతి దీన గా అడిగింది.

పాపం ఇప్పటికి తెలియవచ్చింది విషయం. మతి చలించిందన్లే ఉంది అని అనుకున్నారే తప్ప మరి ఆలోచనే లేదు అచటి ప్రముఖులకు ఆమెకు ఆ కష్ట సమయంలో కూడా ఇంటా బయటా కూడ సానుభూతి సాంతం కఱవైపోయింది,

ఇక అత్తగారు ఉండబట్టలేక జుట్టు గట్టిగా పట్టుకుని చెళ్ళన ఒక్క చెంపదెబ్బ వేసి జబ్బ పట్టుకుని లాక్కొచ్చి వాడు నీ మొగుడే కాదంటె కాకపోడు, నీ దురదృష్టం చేత నువ్వు వర్ణించిన అందచందా లన్నీ ఎప్పుడో అడుగంటాయి, ఇక ఈ వీర విహారం మాని కుక్కిన పేనులా ఈ పీనుగు దగ్గిర కూచుని కాస్త గట్టిగా ఏడ్చిచావు అంటూ కూకలేసింది ఆ మహా యిల్లాలు. కోడలిమీద ఆ మహా తల్లికి గల ఆప్యా యత చూడండి—ఆహా! అక్కడ చేరినవారంతా ఆమెను బిగ్గరగా ఏడవమనె సలహా లిచ్చారు! ఎంతటి మానవత్వం! ఆమె మళ్లీ మళ్లీ

కళ్ళింత చేసుకుని ఆ దేహాన్ని అదేపనిగా చూసింది. మాసిన గెడ్డం శివాజీ గెడ్డంలా మహర్షుల జడలలా దట్టంగా తెగ పెరిగిన జుట్టు లోతుకుపోయిన విశాల ఫాలం ఎంత వెదికి చూసినా నరసింహం పోలి కలు ఏ కొంచమయినా కనపడలేదు. వీళ్ళంతా తన భర్తె అంటున్నారు గనుక ఒక్కసారి తల ఆన్చి ఆ చల్లని పాదాలకి నమస్కరించింది.

ఒక్కసారి చుట్టూ ఉన్న పెద్ద లందరి హృదయాలూ చిల్లులు పడేటట్లు చూసింది : చీర కుచ్చెళ్ళు చేతపుచ్చుకుని ఫెరట్లోకి వెళ్ళినట్లు వెళ్ళి మిత్రురాలి సహాయంతో ఆ రాత్రే ఆ వూరునుంచి వెళ్ళిపోయింది.

ఆమె ఏమైన లేదని అందరూ గుమికూడి మాట్లాడుకోవడంలో ఆ విషయం గమనించనేలేదు ఎవరూను.

అలా అదృశ్యమైన శాంత అతి ప్రేమతో రోగుల సేవ చేసేది నర్సుగా ఆ వృత్తిలోనే మంచి పేరు గడించింది.

సమయం దొరికినప్పు డెల్లా సాహిత్యంతో కాలక్షేపం చేసి సంఘం కుళ్ళును సద్రచనల ద్వారా కడగాలని సంకల్పించింది. తద్వారా వచ్చే ధనంతో నిరుపేదలకు ఉచిత ప్రసూతి గృహాలూ అనాధలకు విద్యా సౌకర్యార్ధం విరాళాలూ ఇచ్చి ఆదుకొనేది. తనలాంటి అభాగ్యజీవి ఉండ కూడదని భావించేది. అది అంత సులభసాధ్యమా ? అయినా శక్తినను సరించి కుటీర పరిశ్రమలూ నిరుద్యోగ నిర్మూలన చెయ్యాలని సంకల్పిం చింది. అన్నింటికీ ఏదో విధంగా నరసింహం పేరు పెడుతూనే వచ్చింది, రచయితగా ఎన్నో వ్రాసి హృదయ నాధునికి అంకితం చేస్తూ వచ్చింది. తన భర్తని అమరుడిగా శాశ్వతం చేసుకుంది,

ఇది జరిగిన యదార్ధ కధే అంటె పతితలు తమ్ముతారా ?

ఓం తత్ సత్

నా మాతృమూర్తి



శ్రీమతి గొబ్బూరు వెంకట సుభద్రమ్మగారు

ఆమెకు భగవంతుడు ఆయురారోగ్యములను
ప్రసాదించాలని ప్రార్థిస్తూ.

**Ch. స్వరాజ్యలక్ష్మి**



## శ్రీమతి చిల్లరిగె స్వరాజ్యలక్ష్మి

జన్మస్థలం : కాకినాడ. : : జననం : 5_2_1926

1951 నుండి సెయింట్ తెరిసాస్ బాలికోన్నత పాఠశాలలో గ్రేడ్ వన్ తెలుగు పండిట్‌గా పనిచేసి 1983-న సం॥ ఫిబ్రవరి నెలలో రిటైరయినారు.

---

**Jyothi Creations Offset&Letter Press, Kavadiguda, Secunderabad-380.**